

28-11-86వ తేదీన హిందీ ప్రేమీమండలిలో హిందీ టంకణ విద్యాలయం సత్రాంతోత్సవం సందర్భంలో విద్యార్థులతో తీయబడిన ఛాయాచిత్రం.

కుడినుండి-కుర్చీలలో శ్రీమతి యస్. లావణ్యవతి, ఎ. కమలకుమారి, పి. భారతీదేవి, బి. సుభద్రాదేవి, బోయపాటి నాగేశ్వరరావు, వేమూరి ఆంజనేయశర్మ, ఎ. రామస్వామి, యస్. సత్యనారాయణాచార్యులు, సి. హెచ్. నిరంజన్‌గార్లు.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర, హైదరాబాదు

# హిందీ ప్రచారకులకు విజ్ఞప్తి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, మద్రాసు వారి ప్రవేశిక, విశారద, ప్రవీణ హైయ్యర్ పరీక్షల మరియు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష, ప్రారంభిక పరీక్షల రుసుము అపరాధ రుసుముతో పాటు జనవరి పదవ తేదీ వరకు స్వీకరింపబడును. **పరీక్షలు 1987 ఫిబ్రవరి 14, 15 తేదీలలో జరుగును.**

హిందీ ప్రచారకులు యీ సదవకాశమును వినియోగించుకొన ప్రార్థన.

కార్యదర్శి

# UCHCHA SIKSHA AUR SHODH SANSTHAN

# DAKSHINA BHARAT HINDI PRACHAR SABHA

* * *

## HINDI MEDIUM B Ed , COLLEGE, VIJAYAWADA

Applications are invited for following Course at Vijayawada

B Ed /Shiksha Snathak : (One Year Course):

Qualifications for Admission :

A pass in B A./B.Com/B Sc degree examination with Hindi or a pass in Rashtra Bhasha praveen or its equivalent examination recognised by the Sansthan f r B.Ed. A pass in Rashtra Bhasha praveen of D B.H.P. Sabha or its equivalent examination recognised by the Sansthan with S S L C. for Shiksha Snathak Course.

Deserving students are eligible to get Government of India's Scholarships.

Application forms Syllabus for admisson can be had from the Registrar, Post graduate & Research Complex, D.B.H.P. Sabha, P B No 82, Khairatabad, Hyderabad-500 004. on payment of Rs. 10/- in cash or by Crossed Postal Order.

Last date for receipt of applications for Course starting on 1-2-1987 is 16-1-1987.

**V. ANJANEYASRMA**
**Registrar**

# స్రవంతి

## సాహిత్య మాస పత్రిక

**393**

జనవరి, 1987 | సంపుటి : 33, సంచిక 10

వార్షికచందా : పదిహేను రూపాయలు | విడిప్రతి : రూపాయిన్నర

సంపాదకులు

ఎ. రామస్వామి

# ఈ సంచికలో

సంపాదకీయం

# కేంద్ర సభలో బాంబు సంఘటన

ఇటీవల మద్రాసు త్యాగరాయనగర్ నందలి దక్షిణ భారత హిందీ ప్రచారసభ మీటింగుహాలులో డి.యం.కె కు చెందిన హిందీ వ్యతిరేకోద్యమ కార్యకర్తలు ఒక బాంబుపెట్టగా అది ప్రేలి కొద్ది నష్టము జరిగినట్లుగా వార్త వచ్చింది. అంతకు ముందు కొంతకాలముగా ఈ ఉద్యమకారులనుండి సభకు మద్రాసులోని దాని కార్యకలాపములను నిలుపుచేయవలసినదిగా జాబులు వచ్చినట్లుగా కూడ తెలియవచ్చినది.

డిశంబరు 9వ తేదీన డి యం.కె ఆధ్వర్యాన తమిళనాడు రాష్ట్రమంతటా హిందీని అధికారభాషగా పేర్కొన్న రాజ్యాంగప్రతిని తగులపెట్టినట్లు, వేలాది నాయకులు, కార్యకర్తలు అరెస్టయినట్లు పత్రికలలో వార్తలు వచ్చాయి. ఈ ఉద్యమ పరిణామాలు తమిళనాడు రాజకీయాలలో విచిత్రంగా మలుపు తిరుగుతున్నట్లు పత్రికలద్వారా గోచరమవుతోంది, ఈ ఉద్యమ నిర్వహణ విధానాన్ని, ఈ పరిణామాలను ఏమాత్రం పరిశీలనగా చూచేవారికైనా ఇది కేవలం భాషాసంబంధమైనది కాదని భాషసాకుగా పదవిలోలేని-పదవిలోఉన్న రాజకీయపార్టీల కుమ్ములాట అని స్పష్టమవుతుంది. 1965లో కీర్తిశేషులు శ్రీ అన్నాదురై నాయకత్వాన ఇటువంటి ఉద్యమమే మహోద్ధృతంగా జరిగి తరువాత జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ఓడిపోయి డి.యం.కె పార్టీ అధికారంలోకి రావడం జరిగింది. ఆనాటి ఉద్యమం నమూనాలోనే ఈనాటి ఉద్యమం కూడ జరుగుతూండడం గమనార్హం. అయితే ప్రజల సహకారం మేము సెప్టెంబరు సంపాదకీయంలో, పేర్కొన్నట్లు అంతగా ఈ ఉద్యమానికి లభించడంలేదు. ఆ సంపాదకీయంలో మేమన్నది ఇది —

> "కొత్తతరంవారిలో ముఖ్యంగా విద్యార్థివర్గంలో ఇదివరకటి సందిగ్ధ స్థితి లేదు ఎంతోకొంత హిందీభాషాపరిజ్ఞానం భవిష్యత్ జీవితానికి అవసరమనే వారు భావిస్తున్నారు. ఇటువంటిస్థితిలో పట్టుదలకుపోయి హిందీవ్యతిరేకత ప్రకటించడం విజ్ఞత అనిపించుకోదు."

మా యీ అభిప్రాయం సరియైనదిగా ఋజువయినట్లు మేము భావిస్తున్నాము. ఈ ఉద్యమసందర్భంగా కాల్పులు జరిగి దాదాపు 10మంది మరణించడంకూడ జరిగింది. కాని 1965 నాటి మహోద్ధృతరూపం ఈనాటి ఉద్యమానికి లేదు.

ఆనాడు పట్టణప్రాంతాల్లోను గ్రామప్రాంతాల్లోను కూడ ప్రజ తరలివచ్చి ఉద్యమంలో పాల్గొన్నది. ఈనాడు అట్టి స్థితి లేకపోవడానికి కారణం భాషల విషయంలో వచ్చిన అవగాహనేనని చెప్పాలి

తమిళం మొదలయిన ఆయా రాష్ట్రాలకు చెందిన భాషలు పూర్తిగా స్వతంత్రాలు. ఆ భాషల అభివృద్ధి ఆయారాష్ట్రప్రజల అభిరుచి, అవసరాల ననుసరించి ఆ రాష్ట్రప్రభుత్వాలు తీసుకొనే నిర్ణయాలపై ఆధారపడి ఉంటుంది. ఆ రాష్ట్రంలో ఆభాషస్థానం 'కేంద్రంనుండి హిందీనిరుద్దడం వలన కుంటుపడదు. నిజానికి హిందీని ఆడిపోసుకుంటున్న రాష్ట్రాలు తమరాష్ట్రంలో, తమ పరిపాలనలో ఏంజరుగుతోందో పరిశీలించుకోవాలి. తమ రాష్ట్రప్రభుత్వ వ్యవహారాలను మరోభాష అవసరం లేకుండా తమభాషలో జరుపుకొంటున్నారా? తమ పరిపాలనను తమ భాషలో జరుపుకోలేక హిందీవల్ల తమభాషకు అన్యాయం,అవమానం జరుగుతోందని అనడం సబబా! అదికూడా దేశంలోని అన్నిరాష్ట్రాలు కోరేంత వరకు హిందీని పూర్తి అధికారభాషగా అమలుపర్చమని ప్రధానమంత్రి హామీ ఇస్తున్నప్పుడు?? కనుక రాజకీయపార్టీలు ఈ విషయంలో తమపార్టీ రాజకీయ ప్రయోజనాలనుకాక, రాష్ట్రప్రజల ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని వ్యవహరించడం ఎంతయినా అవసరం.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ మద్రాసునగరం కేంద్రస్థానంగా మొత్తం దక్షిణాదికంతకు సంబంధించి ఏర్పడిన సంస్థ. ఆ సంస్థ నిర్మాణం అణువణువున విశాలోన్నతాలయిన జాతీయ విలువలు ప్రోది అయి ఉన్నాయి. ఆ సంస్థఅభివృద్ధిలో మొత్తం దక్షిణాదికిచెందిన లక్షలాది హిందీ అభిమానుల, హిందీ ప్రచారకుల, హిందీ విద్యార్థుల జాతీయదృక్పథం, శ్రమ, పట్టుదల,సహృదయత రంగరించి ఉన్నాయి. అంతేగాదు, ఈ సంస్థ ఒక్క హిందీ ప్రచారానికి మాత్రమే అంటిపెట్టుకొని ఉన్న సంస్థకాదు. మాతృభాషలకు ప్రధానస్థానం లభించాలనే ఆదర్శంతో పనిచేస్తున్న సంస్థ.

"Hindi not in the place of the mother tongue, but in addition to it"

అన్నది దీని ఆదర్శాలలోప్రధానమైనది. ఈ ఆదర్శం ఈ సభకు మహాత్మగాంధీ ద్వారా లభించింది. ఈనాటికీ ఇది, ఈ ఆదర్శానికీ, పై జాతీయ విలువలకు అనుగుణంగా వ్యవహరిస్తున్న సంస్థ. అట్టి విలువలను, ఆదర్శాలను ఎవరో కొందరు పార్టీ రాజకీయ ప్రయోజనాల కోసం ధ్వంసం చేస్తామంటే అంతకు మించిన అవివేకం మరొకటుండదు.

# కబీరు సూక్తులు

— ఈమని దయానంద

మాలచేతబూని ఫాలభాగమున
తిలకమద్దుకొన్న ఫలితమేమి ?
కత్తిరించుకొన్న గడ్డాలు మీసాలు
భక్తినంది బంధ ముక్తుడగునె ?

మనసునిండ ప్రేమ మసలుచుండిన చాలు
వల్లెవేయనేల వానిపేరు ?
భర్తనెపుడు మదిని భావింతురే గాని
పేరుపెట్టి సతులు పిలువబోరు.

సంతరింపదగును సాధు సాంగత్యమ్ము
జొన్నకూడు కుడుచు చున్నగాని
పంచభక్ష్యములను పరమాన్న మబ్బినం
గుజనమైత్రినెపుడు కోరదగదు

నూరు యోజనముల దూరమందున్నను
మంచిమిత్రుడుండు మదినిజేరి
మోసకారిహితుడు మొగసాలనున్నను
జలధి కావలయని తలపవలయు.

వారి వీరివల్ల ప్రేరణ మందువా
డనుకరించుభక్తి అతుకబోదు
లేశమైనగాని క్లేశమ్ముగలుగుచో
పాముకుబుస మట్లు పరిహరించు.

# దెయ్యాల కొంప

—డా. తంగిరాల వెంకట సుబ్బారావు

ఒకప్పుడు నాదేశం
అందమైన మనుషులెందరో నివసించే
విశాలమైన మందువాలోగిలి
ఇప్పుడు—
రకరకాల భాషోన్మాదభూతాల
ఇరుకు కొంపల
పాడుకూడలి
ఒక దెయ్యం—
తనజాతి భూతాలను ప్రోగుచేసి
కన్నడ నగరం నడిబొడ్డున
సోదరభాషల చలనచిత్రాల హీరోలకు గుండు గొరిగించి
సున్నపు బొట్లు పొడిపించి
గాడిదలమీద ఊరేగించి
ఊరిబయట చితిపేర్చి నిప్పెట్టింది!
మైనారిటీల నిస్సహాయ దృక్కుల్లో నిశ్శబ్దంగా రగిలే ప్రతీకారజ్వాలల్ని
మెజారిటీ పశుబలంతో కప్పెట్టింది!
మరోదెయ్యం—
తన ఉన్మత్త భజన సంఘంతో బయలుదేరి
పత్యర్థులైన కొరివి దయ్యాల నగరపాలక సభలోదూరి
"దెయ్యాలభాషకే జయం కొరివిదయ్యాల భాషకూడదు"
అని అరిచింది.
పిచ్చికోపం తెచ్చుకున్న కొరివిదయ్యాలు
చచ్చిపోయిన తమ నాయకుణ్ణి తలచుకొని
భజనసంఘం దెయ్యాన్ని పట్టి
దురభిమానం త్రాళ్ళతో కట్టి
బండబూతులు తిట్టి
దావగొట్టి చెవులుమూసి
గేటుబయట కిడ్చివేశాయి....

కాసరగోడులో మలయాళ మంత్రాల భూతనృత్యాలు...
గోవాలో శివాజీ కత్తిమెరుపుల మధ్య
భాషా బ్రహ్మరాక్షసి
శిలువమీదికెక్కి చేసే రక్తనినాదాలు
ఓ పరమేశ్వరా !
ఈ భూతగణాల మధ్య ఎలాగ బ్రతకడం?
నువ్వే మా పాలిటి జాతీయభావాల భూతవైద్యుడిగా వచ్చి
దేశభక్తి మంత్రోచ్చాటనలు హెచ్చి
ఉన్మత్త భాషాభూతాలను క్రమశిక్షణ సీసాల్లోదింపి
మా ఉక్క బ్రతుకుల్లోకి చల్లని శాంతిని పంపి
ఈ దెయ్యాల కొంపని బాగుచేసి
అందరికీ ఐకమత్యపు రాగికడియాలు వేసి
రక్షిస్తే—
నా చర్మం చెప్పులు కుట్టిస్తాను!
నా ప్రాణాలు హారతిపట్టిస్తాను!
దేవుడా రక్షించు నా దేశాన్ని...!

రీడర్ ఇన్ తెలుగు
బెంగుళూరు యూనివర్సిటీ
"జ్ఞాన భారతి"
బెంగుళూరు-560 056

# స్మృతుల దీపాలను వెలిగించుకో

హిందీ మూలం :

నిశ్శంక చిలే

తెలుగు అనువాదం :

చిలుకమారి సంజీవ

నేస్తమా !
అంధకారం అలుముకుంటే,
స్మృతుల దీపాలను వెలిగించుకో.
జ్ఞాపకాల సుమాలను పుష్పించుకో
నీ ముందు బాధలుంటె
తుపానుకు పిరికితనం జనిస్తే
సంకల్పాల నావ చలించి పోతే
సాహసం నిన్ను వదలిపోతే
దుఃఖం నిరాశ బాధల
నల్లని మేఘాలు ఆవరిస్తే
ఆశల ఖద్యోతం ఒక్కసారి
తళుక్కుమని మాయమైతే
హల్దీఘాటి రాణా ప్రతాపుని
సాహసాన్ని మదిలో మేల్కొల్పుకో
ఒకవేళ
ప్రేమ పథంలో హృదయ దర్పణం
ముక్కలైపోతే
జీవిత తొలి దశలోనే
మనీషుల మణులు దొంగిలించబడితే
కోరికల చితికి నిప్పంటుకుంటె
ఈ సంసృతే శూన్యంగా తోస్తే
ఉన్మత్త మనస్సు పై
వైరాగ్య మేఘాలు మనస్సును కప్పివేస్తే
రాధా మాధవుల వ్యథా కథా బింబాన్ని
హృదయంలో మేల్కొల్పుకో-

హిందీ లెక్చరర్, ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి
కాకతీయ విశ్వవిద్యాలయం
వరంగల్.

# ఒకటో నవంబరు 86

— ముదిగొండ వీరేశలింగము

చుట్టూ దీపావళి వెలుగుతుంది
చట్టుబండలైంది నా హృదయంలో
వెలుగులన్నీ చీకట్లుగా
చీకట్లన్నీ వెలుగులుగా
చకచకా మారిపోతున్న ఈ తరుణంలో
చెంతకు వచ్చినట్లే వచ్చి కూర్చొని దీపావళి
దట్టంగా, దేదీప్యమానంగా, వెలిగిపోకుండా
దద్దరిల్లి పోయింది, నాకన్నా వెలుగు ఎవరని ?
ఈర్ష్యాభావం, అతిశయించి పోయింది.
నాకన్నా వెలుగున్న మరోవ్యక్తి
ఎవరా అని లోకంలో ఉన్న
వెలుగంతా ఆవిరిపోయింది.

ఏ ఊరికెళ్ళినా, ఎ సభల కెళ్ళినా
అగ్రపీఠం తనది, అగ్ర తాంబూలం- తనది-
అధిపత్యం తనది- అదరింపు తనది
ఉపన్యాసం తనది- ఉత్తరీయం తనది

నిండుదనం నిండిన నవ్వులజల్లు, చూచిన
నా హృదయం చల్లును ముత్యాలెన్నో
పండబారిన పాండిత్యం గుబాళింపు
పరమ పావన భావం ప్రసరించే ఘనం యింపు.

అనాడు—
శ్రీనాథుని రాకతో అమరపురిలో
దివిజ కవివరు గుండె గల్
ఢగ్గుమనిపించాయి.
మరి యీనాడేమో స్వర్గంలో

అపర శ్రీనాథుని అవతారికతో
అవని వట్టిపోయింది, ఆయన వస్తున్నారని
అమరం అట్టుడికిపోయింది
స్వాగతా లెన్నెన్నో సహజంగ పలికేది.
నవంబర్ ఒకచోనాటికి
పన్నెండోరోజు అయిపోయింది
మా సాహిత్యకలం చిన్నపోయింది
ఉగాది వచ్చిందంటే
రేడియో సమ్మేళనంలో మ్రోగే నీ గొంతుక
మళ్ళీ రాదుకద ఎన్ని యుగాదులైనా
వరంగల్లో వినాయక చవితి వస్తే
వేస్తే పెద్దపీఠం తనదే కద
గ్రంథం ఆవిష్కరించ బడితే
ఒకచోట పరిచయం — మరొకచోట పీఠిక
వేరొకచో ప్రధానోపన్యాసం
ఎక్కడ చూచినా తమరే- వేదికలన్నీ తమవే
అన్నీ చిన్నబోయి శూన్యం ఆవరించింది
ఒకటో నవంబరు దీపావళి
ఎందుకయిందా అని
అంతా చీకటిమయం అయింది
మరింత వెలుగును ప్రసాదించే మనీషి
మరెప్పుడు వస్తాడో అని
లోకం అంతా ఎదురు చూస్తుంది.

(ఒకటి-నవంబరు 88 రోజు హైదరాబాదులో కూర్చొని క్రుంగిన మనస్సుతో కీ. శే. కళాప్రపూర్ణ దివాకర్ల వారి స్మృతి చిహ్నంగా వ్రాసిన గేయం)

## 19వ ఏటనే రచన విరమించిన

# ఆర్థర్ రంబో

— మానేపల్లి

15వ ఏటనే స్వదేశంలోనూ కొన్ని విదేశాల్లో కూడా ప్రసిద్ధకవిగా గుర్తింపు పొంది- 19వ ఏట రచనా వ్యాసంగం చాలించడం- 37 ఏళ్లకే జీవితం కూడా చాలించడం అంటే ఆనందకరమూ, ఆశ్చర్య కరమూ, విషాదకరమూను.

కాని ఆర్థర్ రంబో అనే 19వ శతాబ్దపు ఫ్రెంచి కవి విషయంలో ఇది వాస్తవం.

### ంలో రచనలు

జాఁ నికోలస్ ఆర్థర్ రంబో (ఫ్రెంచ్ ఉచ్చారణకు సమీపం) ఫ్రాంసుదేశంలో శార్లవిలి అనేచోట 1854 అక్టోబర్ 20వ తేదీన మాతామహుడి ఇంట జన్మించాడు. తండ్రి ఫ్రెడరిక్ రంబో ఒక సాధారణ సిపాయిగా జీవితం ప్రారంభించి కాల్బలానికంతటికీ అధిపతిగా, కెప్టెన్‌గా, ఉన్నతస్థితిని సాధించాడు. అతడి మిలటరీ జీవితం యావత్తూ దాదాపు అల్జీరియాలోనే గడిచిపోయింది. మిలటరీ విధానాలకు సంబంధించిన గ్రంథం ఒకటీ కొరాన్‌కు ఫ్రెంచి అనువాదం ఒకటీ రచించాడుగాని ఆ గ్రంథాలు ప్రచురితంకాలేదు. ఆర్థర్ రంబో అరబిక్ నేర్చుకుందుకు కొన్నాళ్ళు తండ్రి రచనతో కుస్తీపట్టాడు. తల్లి వంక తాతగారు భూస్వాములు. చుట్టుపక్కల ప్రాంతాలకంతటికీ మోతుబరులుకూడాను. కెప్టెన్ రంబో కుమారుడైన ఆర్థర్‌కు ఆరేళ్ల వయసులో భార్యను విడిచిపెట్టేశాడు. ఆ తరువాత ఇక ఎప్పుడూ ఆర్థర్ తండ్రిని చూడనేలేదు.

తల్లిది ఒకవిధమైన పెంకి మనస్తత్వం. ఇద్దరన్నగార్ల ప్రభావం ఆమెపైవుంది. కొడుకును బడికి పంపించింది. పదేళ్ళ వయసులోనే ఒక కథ రాశాడు. పదేళ్ళ వయసులోనే కాలేజీ చదువుకు వెళ్లాడు. చక్రవర్తి పట్టాభిషేక మహోత్సవ సందర్భంగా పన్నెండేళ్ళ వయసులో 60 పాదాల కవిత రచించాడు. ఆర్థర్‌కు చదువుచెబుతున్న ట్యూటర్ అదిచూసిమెచ్చి ప్రధానోపాధ్యాయుడితో ఈ సంగతిచెప్పి కుర్రవాడిని నలుగురిలోకి పిలిచి అభినందించవలసిందని సలహాయిచ్చాడు. ఆ కవితను ఆర్థర్ లాటిన్ భాషలో (షట్పదులవంటి ఛందంలో) రచించాడు. ఆ తరువాత సంవత్సరం, 1869లో, పద్నాలుగున్నర సంవత్సరాల వయసులో అత్యంత ప్రతిష్ఠాకరమైన లాటిన్ కవితా బహుమతిని పొందాడు. ఆరోజు ఉదయం ఆరుగంటలకే పోటీస్థలానికి వెళ్ళాడు. చేతుల్లోగడ్డం పెట్టుకుని, చాలా నిరుత్సాహంగా, నీరసంగా బెంచీమీద కూచున్నాడు. హెడ్‌మేస్టారు వచ్చారు "నువ్వా వచ్చావా?" అన్నారు. అప్పటికే తొమ్మిదయింది. "ఆకలి దంచేస్తోంది" అన్నాడు ఆర్థర్. బుట్టతో రొట్టె, వెన్న పాకెట్లు వచ్చాయి. ఒక రొట్టె తీసుకుని గబగబా తినేశాడు. కలం పట్టుకున్నాడు. ఎక్కడా ఆగకుండా, ఎత్తిన కలం దించకుండా, ఒక్కవేటున ఎనభైపాదాల లాటిన్ కవిత రాశాడు. నిర్ణీతకాలం

ముగియకముందే కాయితాలు అధికారికి అందజేసి వచ్చేశాడు. ఎవ్వరూ ఎదురుచూడని సంఘటన ! అత్యద్భుతమైన అత్యంత సమర్థవంతంగా రచించబడిన కవిత ! చదువుకున్న కాలేజీ ప్రతిష్ఠను కాపాడాడు అనుకున్నాడు ప్రధానోపాధ్యాయుడు !

అదే సంవత్సరం డిసెంబర్‌లో ప్రప్రథమంగా ఫ్రెంచికవితల్లడం ప్రారంభించాడు. మొదటి కవిత కొద్దిరోజుల అనంతరం ఒక ప్రఖ్యాత పత్రికలో (1870 జనవరి 2వ తేదీ) అచ్చుపడింది. 'అనాథ నూతన సంవత్సర కానుక' అనే ఆ సుదీర్ఘ కవిత చాలా ప్రశంసలు పొందింది.

### కవితా 'కాంతిపుంజం'

1870లో జార్జ్ ఇజంబర్డ్ అనే ఆయనతో పరిచయం అయ్యింది. అతడొక ఉపాధ్యాయుడు. విప్లవ భావాలు కలవాడు. ఆర్థర్‌ను ప్రఖ్యాత ఫ్రెంచ్ రచయితలైన రబివే, విక్టర్ ఊగో రచనలు చదవమని అతడు ప్రోత్సహించాడు. మొదట్లో తల్లికి ఇదంతా నచ్చలేదు. అయినా ఆర్థర్ చదివాడు. పుంఖానుపుంఖాలుగా పద్యాలు రచించాడు. పదిహేనవఏటనే దేశం అంతటా ఒక మంచికవిగా ప్రసిద్ధుడయ్యాడు. ఈమాట స్నేహితుడు బాన్‌విల్‌కు రాశాడుకూడాను. ఆగస్టు 29వ తేదీన, బహుమతిగా వచ్చిన పుస్తకాలు అమ్మేసి పారిస్‌వెళ్ళ రయిలెక్కాడు. సామ్రాజ్యవాద ప్రభుత్వం పతనంకావడం కళ్ళారా చూడాలని అతని ఆశ ! కాని రైల్వేవారికి 13 ఫ్రాంకులు బాకీపడి అరెస్టయ్యాడు! మిత్రుడు ఇజంబర్డ్‌కు ఉత్తరం రాయగా అతడువచ్చి, ఆదుకుని విడిపించాడు. కొన్నాళ్ళు మిత్రుడి బంధువుల యింట గడిపాడు. తరువాత తల్లికోరిక మేరకు స్వస్థలమైన శార్లవిలి వచ్చేశాడు. పట్టుమని పది రోజులే వున్నాడక్కడ, తరువాత ఇంట్లోంచి పారిపోయి బెల్జియం చేరుకున్నాడు. ఒకానొకవార్తాపత్రిక ఆఫీసులో ఉద్యోగం సంపాదించాలని, ప్రయాణంలో అయిదు ప్రసిద్ధ కవితలు రచించాడు. పత్రికారచయిత నౌదామనన్న అతని కోరిక నెరవేరలేదు. బ్రస్సెల్స్ చేరుకున్నాడు ఇజంబర్డ్ స్నేహితులు కలిసి ఆర్థర్‌ను మళ్ళీ ఇజంబర్డ్ దగ్గరికి పంపేశారు. మిత్రుడి 'చుట్టాలు' అతన్నిచూసి సంతోషించారు. అక్కణ్ణించి స్వగ్రామం శార్లవిలి చేరుకున్నాడు.

ఆ వూరి గ్రంథాలయానికి వెళ్ళి కనిపించిన గ్రంథాన్నల్లా చదవడం ప్రారంభించాడు. 16 ఏళ్ల గుంటడు సోషలిజం పుస్తకాలు చదువుతుంటే లైబ్రెరీ అధికారులకు ఆశ్చర్యం వేసేది. ఒకోసారి చాలా అయిష్టంగా పుస్తకాలిచ్చేవారు. వాళ్లను తిడుతూ 'గాడిదలు'అనే కవిత రాశాడు. గ్రంథాలయాధికారులు మోసే (బాధ్యత వహించిదావే) వాళ్ళు మాత్రమే కాకూడదని అతని అధిక్షేపణ! 71 ఫిబ్రవరిలో మళ్ళీ పారిస్ చేరుకున్నాడు, చెప్పాచెయ్యకుండా, రెండు వారాలు కటిక దరిద్రం అనుభవించాడు. చివరికి నడిచి, నడిచి, నడిచి స్వగ్రామం చేరుకున్నాడు. కవిత్వంగురించి తనకున్న అభిప్రాయాలన్నీ స్నేహితులకు రాసేవాడు. మతవిధానాలను తీవ్రంగా నిరసించేవాడు. బిషప్పులను, ప్రీస్టులను నడివీధులలో నిలబెట్టేసి ప్రశ్నలువేసి అవమానించి పంపేవాడు. పుంఖానుపుంఖాలుగా కవితలు రచించాడు. కొత్త స్నేహితులు ఏర్పడ్డారు. వెర్లయిన్ అనే కొత్త స్నేహితుడు ఏర్పడ్డాడు. అతనితోపాటు పారిస్‌లో వాళ్ల అత్తివారింట్లోనే నివాసం ఏర్పరచుకున్నాడు.ఎప్పుడూ నోట్లో పైపుండవలసిందే !

### స్నేహితులూ, సంచారాలూ

వెర్లయిన్, రంబో ప్రాణస్నేహితులయ్యారు. రాత్రులూ, పగళ్లూ కవిత్వంగురించి చర్చిస్తూ,బార్లలో హోటళ్లలో కాలంకాల్చేస్తూ వుండేవారు. వెర్లయిన్ భార్య గర్భిణి. ఆమె దీర్ఘరోగంతో నరకయాతనలను భవిస్తూ 1871 అక్టోబర్‌లో ఒక కొడుకును కన్నది. ఇంతాచేస్తే ఆమె వయసు 18! ఆమె అనారోగ్యంవల్ల

మిత్రులకు తగినంత స్వేచ్ఛ వుండేదికాదు. వెర్లయిన్ ఆర్థర్‌కంటె పదేళ్ళు పెద్దవాడు. అత్తగారు తమ అల్లుడయిన వెర్లయిన్‌ను పాడుచేస్తున్నాడనీ, నిరంతరం పనికిమాలిన కబుర్లుచెప్పి వెంట తిప్పుకుంటున్నాడనీ ఆర్థర్‌ను తిట్టిపోసేది. దాంతో పారిస్ నగరవీథుల్లో తిరుగుతూ మద్యం త్రాగడం, గంజాయి సేవించడం అలవరచుకున్నాడు. ఇవి ప్రప్రథమంగా సేవిస్తున్నప్పుడు "ఎలా వుంది" అనడిగాడట వెర్లయిన్. "తెల్ల చందమామలూ, నల్లచందమామలూ కనపడుతున్నాయి." అన్నాడట ఆర్థర్. మళ్ళీ స్వగ్రామం శార్లవిలి చేరుకొన్నాడు. అసంఖ్యాకంగా కవితలల్లనారంభించాడు. మిత్రులకు ఉత్తరాలు రాసేవాడు. వెర్లయిన్ కోరికమీద రెండు నెలల తరువాత మళ్ళీ పారిస్ చేరుకున్నాడు. ఆర్థర్ ఉనికి- వెర్లయిన్ యింట్లో అతని భార్యకుగాని, అత్తగారికి గాని ఎంత మాత్రం యిష్టం వుండేది కాదు. 1872 జూన్‌లో రంబో- దాదాపు తన రచనలో చివరి పద్యాలు రాశాడని చెప్పవచ్చు. ఆకాలంలో రాసిన కవితలు-వచన కవితలలో రంబో మానసికస్థితి అత్యంత పరిణత మయినదని చెప్పవచ్చు. అనంతరకాలంలో వెర్లయిన్ ఈ రచనలను గ్రంథరూపంలో వెలువరించాడు. (1886) ఆ పుస్తకానికి వెర్లయిన్ "కాంతిపుంజం" (తెలుగులో చెప్పాలంటే ఇది సరయిన పదం) అనే పేరు పెట్టాడు జులైలో మళ్ళీ స్నేహితులిద్దరూ బెల్జియం బయల్దేరారు- ఇంగ్లండ్‌మీదుగా లండన్‌లో—సోహో, డాక్స్, వెస్టెండ్, లండన్ సండే- మొదలైన వామపక్ష రచయితల సంఘాలతో సంబంధాలు ఏర్పరచుకున్నాడు ఎప్పుడూ చేతిలో డబ్బులుండేవి కావు. దుర్భర దారిద్ర్యం. తల్లి కోరికమీద రంబో తిరిగి స్వగ్రామం శార్లవిలికి వచ్చేశాడు. వెర్లయిన్ లండన్‌లో వుండిపోయాడు. ఇన్‌ఫ్లూయెంజా జ్వరంతో బాధపడుతూ రంబోను రమ్మని రాశాడు. రంబో వచ్చి చేరిన రెండు రోజుల్లో అతని ఆరోగ్యం బాగుపడింది. క్లబ్బులలో సంచారం, కవులతో స్నేహం మళ్ళీ ప్రారంభమయింది. కొన్నాళ్ళ తరవాత రంబో ఫ్రాంసు తిరిగివచ్చి తల్లిగారి వ్యవసాయక్షేత్రంలో వున్నాడుగాని వెర్లయిన్ ఉత్తరాలవల్ల మళ్ళీ ఇంగ్లండ్ వెళ్ళాడు. రంబో వెర్లయిన్‌తో దాదాపు విసిగిపోయాడు. ఈ విసుగు "తిరుగుబోతులు" అనే ఆకాలపురచనలో స్పష్టంగా కనపడుతుంది.

ఈ సమయంలోనే 1873 మే-జూన్ ప్రాంతాల్లో రంబో ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆండర్ గ్రౌండ్ రైల్వేలో ఆమెవెంట వెళుతూ వుండేవాడు. ఒక్కనాడూ మాట్లాడేందుకు ధైర్యం చెయ్యలేదు. వెర్లయిన్ రంబోల మధ్య చాలా పెద్దతగువచ్చేసింది. వెర్లయిన్ బ్రస్సెల్స్ (బెల్జియం) వెళ్ళిపోయాడు. రంబో వెంట వెళ్ళాడు వెర్లయిన్ రంబోపై రెండు సార్లు పిస్తోలుపేల్చాడు. ఒకటి గురితప్పగా మరొకటి ఎడమచేతికి మణికట్టుకు తగిలింది. కట్టుతో చెయ్యి మెడలో వేలాడుతుండగా ఫ్రాంసులో తల్లిగారి వ్యవసాయ క్షేత్రానికి వెళ్ళాడు. అంతకుముందు ఆదే వ్యవసాయక్షేత్రంలో ప్రారంభించిన ఒక రచనను ముగించాడు. స్నేహితుడిపై తుపాకి పేల్చినందుకు వెర్లయిన్ రెండేళ్ళపాటు జైలుకు వెళ్ళాడు.

ఈ గ్రంథం బ్రస్సెల్స్‌లో ముద్రణకు ఏర్పాట్లు చేశాడు. కాని రచనావ్యాసంగం పట్ల పూర్తిగా అభిరుచి నశించింది 1874లో అచ్చయిన ఆ గ్రంథం కాపీలు రచయితకు యిచ్చినవి మినహాయిస్తే 1914 వరకూ (రంబో మరణానంతరం 23 ఏళ్ళ వరకూ) అలాగే ప్రెస్‌లోనే వుండిపోయాయి. తన ఇంగ్లీషు పరిజ్ఞానాన్ని వృద్ధిచేసుకుందామని ఒక యువకవితో స్నేహంచేశాడు ఇంగ్లండ్‌లోనూ, స్కాట్లండ్‌లోనూ అనేక పాఠశాలల్లో పాఠాలు చెప్పాడు. ఈ సమయంలో రంబో తల్లి, చెల్లెలుకూడా, అతనితోనే ఉండేవారు. బహుశా ఈ సమయంలోనే 'అన్‌రికా' అనే అమ్మాయితో కొన్నాళ్ళు కాపరం కూడా వెలిగించి వుంటాడు (అని ఒకరచన సాక్ష్యం యిస్తోంది.)

## దేశాటనం, ఉద్యోగం

1875-80 మధ్యకాలంలో జర్మనీ, స్విట్జర్లాండ్, ఇటలీలలో విస్తృతంగా పర్యటించాడు. జర్మన్, స్పానిష్, అరబిక్, ఇటాలియన్, డచ్, మోడర్న్ గ్రీక్ భాషలు- అధ్యయనం చేశాడు. డచ్‌వారి నౌకా వ్యాపారసంస్థలో ఆరేళ్ళు పనిచేసే ఒప్పందం మీద ఉద్యోగంలో చేరాడు. కాని బటేవియా వెళ్ళి- అక్కణ్ణించి ఈస్ట్ ఇండీస్ ద్వీపాలలో మూడు వారాలు గడిపి ఆ ఉద్యోగం వదిలేశాడు. ఇంగ్లీషు వాళ్ళ ఓడలో ఫ్రాన్సు చేరుకుని ఒక ఓడరేవులో దిగి కాళ్ళుబొబ్బలు పెట్టేలాగ అక్కణ్ణించి నడిచి ఇల్లు చేరుకున్నాడు. 1875 ప్రారంభంలో వెర్లయిన్-రంబో చిట్టచివరి సారిగా కలుసుకున్నారు. అతడు కేథలిక్ మతం పుచ్చుకుని రంబోను కూడా అందులో చేరమన్నాడు. "కోరల మధ్య రుద్రాక్షమాలతో" ఎదురయ్యాడు అని రాశాడు అతని గురించి రంబో.

1877 లో ఒక ఓడలో అలెగ్జాండ్రియా (ఈజిప్టు) బయల్దేరాడు గాని జబ్బు చేయ్యడం వల్ల దారిలోనే వెనక్కి మళ్ళి పోవలసి వచ్చింది. కాని తిన్నగా యింటికి వెళ్ళలేదు. రోమ్‌లో కొన్నాళ్ళు గడిపి అప్పుడు స్వగ్రామం చేరుకున్నాడు. ఆ మరునాటి వసంతంలో మళ్ళీ ప్రాచ్యదేశాల వేపు వెళదాం అని బయలుదేరాడు గాని కుదరలేదు. శీతకాలంలో స్విట్జర్లండు, ఇటలీ దేశాలు తిరిగి చివరికి మళ్ళీ అలెగ్జాండ్రియా వెళ్ళే పడవ పట్టుకున్నాడు. సైప్రస్‌లో 'ఫోర్‌మన్'గా ఉద్యోగం సంపాయించాడు. కాని టైఫాయిడ్ వ్యాధి సోకడం వల్ల 1879 జూన్‌లో స్వగ్రామం శార్లవిలి చేరుకున్నాడు. ఆ సంవత్సరపు శీతాకాలం కుదురుగా యింట్లోనే వున్నాడు. 1880 లో మళ్ళీ సైప్రస్ వెళ్ళాడు. గవర్నర్ జనరల్ గారి కొత్త భవంతి నిర్మాణంలో సహాయదారుగా పనిచేశాడు అక్కడి వాతావరణం నప్పక అలెగ్జాండ్రియా వెళ్ళాడు. అక్కణ్ణించి ఏడెన్ (సౌదీ అరేబియా) వెళ్ళాడు. కాఫీ వర్తకుల దగ్గర ఉద్యోగం సంపాదించుకున్నాడు. వాళ్ళు అతన్ని అబిసీనియా లోని హరార్ అనే ప్రాంతానికి పంపించారు. "సోమాలి ఎడారిలో ఇరవై రోజులు గుర్రం మీద ప్రయాణం చేసి" మొత్తానికి అక్కడికి చేరుకున్నా

## చివరి దశాబ్దం

అక్కడ పనిచేస్తూ వర్తక వ్యవహారాలు తెలుసుకున్నాడు. సాహసకార్యాలు చేస్తూ దూరప్రాంతాలు ప్రయాణించి అపార ధనరాసులు గడించాలని కలలు గన్నాడు. తల్లికి క్రమం తప్పకుండా డబ్బు పంపిస్తూ వుండేవాడు. సాంకేతిక గ్రంథాలు, ఫోటోగ్రఫీ పరికరాలు పంపమని తల్లికి రాశాడు. 1882-88 లలో యజమానులు ఆర్థర్ రంబోను సోమాలి, గాలా మొదలైన ప్రాంతాలన్నీ పర్యటించి వ్యాపార పరిస్థితులను కనుక్కొని రమ్మని నియమించారు కొత్త ప్రదేశాలఆజ కనుక్కొని రమ్మని కూడా వారు చెప్పారు. స్వామి కార్యం కొంత, స్వకారం కొంత అన్నట్టు, సోమాలి, గాలా ప్రాంతాలు తిరుగుతూ ఒగడీన్ ప్రాంతంలో ప్రప్రథమంగా అడుగుపెట్టాడు. ఆ ప్రాంతాలన్నీ తిరిగి "జియోగ్రఫిక్ సొసయిటీ" వారికి ఒక సవివరమయిన నివేదిక పంపాడు. వారు ఆ నివేదికను అచ్చువేశారు. ఒగడీన్ ప్రాంతంలో ప్రప్రథమంగా పాదం మోపిన యూరపియన్ అతడే! ఈ సమయంలో తాను లండన్‌లో గడిపిన కాలాన్ని గుర్తు తెచ్చుకొని "అది పూర్తిగా తాగుడు మైకపు కాలం" అని రాశాడు ఒక ఉత్తరంలో. 1885లో ఒక పొడవైన సన్నని అందమైన అబిసీనియన్ వనితతో కాపురంచేశాడు. ఆమె సహకారంతో తుపాకులు, మందుగుండు వ్యాపారం చెయ్యబోయాడు. కాని లాభించలేదు. తిరిగి హారర్ చేరుకున్నాడు. కాఫీ, చర్మాలు, కస్తూరి మొదలైనవి నిలవ

చేసే గోదాన్‌లో పనిచేశాడు ఆయుధాలు, మందు గుండు అమ్ముకునేందుకు లైసెన్సు సంపాదించాడు బానిసలను ఉత్తర ఈశాన్య ప్రదేశాల నుండి టర్కీకి, అరేబియాకి ఎగుమతి చెయ్యడంలో సహక రించేవాడు వీలయినంత తక్కువఖర్చుచేస్తూ పొదుపు చేస్తూ డబ్బునిల్వ చెయ్యడం నేర్చుకున్నాడు. కాని నీగ్రోలపట్ల చాలాజాలికలిగేది అడిగినవారికి, అడగని వారికీ వారి పరిస్థితినిబట్టి సహకరించేవాడు. దాంతో కూడబెట్టినధనం కర్పూరంలా కరిగిపోనారంభించింది. 1891 ఫిబ్రవరిలో కుడి మోకాలిపై వ్రణంలేచింది. అప్ప టికి అతని దగ్గర కేవలం రెండువేలపౌనులు మాత్రమే మిగిలాయి. మేలో ఫ్రాంసు దక్షిణ తీరంమార్సెయిల్ పట్టణం చేరుకుని అస్పత్రికి వెళ్ళగా కుడికాలు ఆప రేషన్‌చేసి తొలగించారు. కేవలం రెండునెలలు స్వస్థలంలో గడిపాడు కాని తిరిగి మళ్ళీ మార్సెయిల్ వచ్చి ఆరోగ్య పరిస్థితి విషమించగా ముప్పయి ఏడవ ఏట 1891 డిసెంబర్ 10వ తేదీన ఆస్పత్రిలో మరణించాడు ఆర్థర్‌రంబో.

### జీవిత విశ్లేషణ: కవితా లక్షణాలు

రంబో జీవితచరిత్ర వీలయినంత క్లుప్తంగానూ ఏ వివరాలూ విడిచి పెట్టకుండానూ వివరించాను. ఈ వివరాలను విశ్లేషిస్తే మనకు కొన్ని సంగతులు తెలుస్తాయి.

తనవంశంలో సమీపపూర్వులెవరికీ లేనంత ఎక్కువ మేధశ్శక్తి రంబోకు పుట్టుకనుండీ వచ్చింది. బాల్యంలోనే పెద్దలను ఆశ్చర్యచకితుల్ని చేయగలిగి నంత గొప్పరచనలు చేశాడు. తొలియవ్వనం ప్రవే శించినప్పటినుండీ అతనిరచనాశక్తి పరిణతి పొందింది. అతని జీవితంలో రచనాకాలం (12నుండి 19సం॥లు) అత్యంత సృజనాత్మకంగా గడిచింది. ఫ్రెంచిసాహిత్య చరిత్రలోనేకాదు ప్రపంచ సాహిత్యచరిత్రలోకూడా చిరస్థాయిగా నిలవగలిగినంత గొప్ప రచనలు చేశాడు. ఇందుకతనికి ఎవరినుండీ సహకారం లభించకపోగా దుర్భర దారిద్ర్యాన్నెదుర్కున్నాడు. అస్తిమితమైన జీవితాన్ని గడిపాడు. 19 సం॥లు నిండేసరికి దాదాపు రచనా వ్యాసంగం విరమించాడు. రచన అతనికి సంతోషాన్నిగాని ధనాన్నిగాని, చెప్పుకోదగినంత గొప్పకీర్తినిగాని ఇవ్వలేకపోయింది. ప్రాణ స్నేహితు డితో సంబంధం చెడిపోగా అతడు తుపాకి పేల్చే వరకూ పరిస్థితి విషమించింది. యురోపు దేశాలన్నిటా అస్తిమితంగా పర్యటన చేశాడు. సౌదీ అరేబియా, ఈశాన్య ఆఫ్రికా దేశాలలో ఉద్యోగంచేస్తూ చివరి దశాబ్దం అంతా గడిపాడు. నికరమైన సంపాదం, యిల్లూ వాకిలీ అనే బంధాలు లేవు. ఆరవయేటనే తండ్రి నుంచి విడిపోయినా తల్లిపట్లనయినా చెప్పుకో దగినంత ఎక్కువ మమకారం లేదు. (మార్క్స్ మ్యూలరుకు తల్లిపట్ల అత్యంతాతి అతిశయమైన మమ కారం) ప్రారంభ యౌవనంలో సోషలిజం పుస్తకాలు చదివిన మాట నిజమే కావచ్చునుగాని చెప్పుకో దగినన్ని అభ్యుదయభావాలు కలవాడేమీకాదు బానిసల ఎగుమతికి సహకరించడం, వ్యాపారదృష్టి పెంచుకో వడం (లాభించలేదనుకోండి) అతని మనస్తత్వాన్ని మరింతగా పట్టిస్తాయి. అంతమాత్రాన పాషాణ హృద యుడు కాదు. నీగ్రోబానిసలకు స్వేచ్ఛవాన్ని దానంచేసి మానవతాదృష్టి ప్రదర్శించాడు. చిన్నతనంలోనే మతాన్ని నిరసించి మతగురువుల్ని ధిక్కరించాడు.

తన రచనలలో అధికభాగం అప్రచురితంగానే వుంచేశాడు. పద్యాలల్లడం 19 ఏటనే మానుకున్నా స్నేహితులకు సవిస్తరమైన ఉత్తరాలు రాసేవాడు. విమర్శనా సాహిత్యం చెప్పుకోదగినంతగా వృద్ధి పొందని కాలంలో రంబోను ఎవరు పట్టించుకుంటారు? "భావకవితావాదం (రొమాంటిసిజం) గురించి ఎవరూ అంతగా చర్చించలేదు. దాని మంచి చెడ్డలను గురించి ఎవరు తీర్పుచెబుతారు- విమర్శకులా ?!" అన్నాడట రంబో.

15-16 వయసులో స్వగ్రామం శార్లవిలి గ్రంథాలయంలో చదివిన గ్రంథాలలో ఇంద్రజాలం, మాంత్రిక విద్య, రసవాదం [కృత్రిమంగా బంగారాన్నితయారు చేసేవిద్య] మొదలైన విషయాలపై గ్రంథాలు కూడా చాలాఎక్కువ సంఖ్యలోచదివాడు. కనుకఆయా అంశాలలో కొంతయినా పరిచయం వుంటే తప్ప రంబో కవిత స్పష్టంగా అర్థం కాదు. చాలా నూతనమైన, విచిత్రమైన ప్రతీకలుపయోగిస్తాడు రంబోతో సన్నిహిత పరిచయం గల ఆబిసీనియా వర్తకుడుడా॥ఎనిడ్ స్టార్కీ కొన్ని వివరణ లిచ్చాడు. తన రచనల పట్ల వాటి ప్రచురణ పట్ల రంబోకు ఏ కొంచెమూ శ్రద్ధ వుండేది కాదని ఆయన చెప్పాడు. రంబో మరణానంతరం పారిస్‌లో అచ్చయిన అతని రచనలవల్ల ఒక్క వెర్లయిన్ మాత్రమే లాభాలు పొందాడు.

చిన్నతనంలోనే తండ్రిని పోగొట్టుకున్నాడు తల్లిది చాలా నిర్దయ గల పెలుసు స్వభావం, ఆర్తర్, అతని అన్న వితాలీ తల్లి చేతిలో చాలా బాధలు పడ్డారు. బోలెడన్ని లాటిన్ పద్యాలిచ్చి అప్పగించమనేదట. ఒక్క తప్పు కూడా లేకుండా" అప్పజెప్పు లేకపోతే ఆ రాత్రికి తిండి పెట్టేది కాదు బడినుండి తిన్నగా యింటికి రావలసిందే దారిలో ఆలస్యం చెయ్యడానికి వల్లకాదు

ఇవన్నీ ఆర్తర్ మనసులో ఒక రకమైన న్యూనతా భావాన్ని భద్రత లేదనే భయాన్ని కల్పించాయి. జీవితం అంతా ఇతర ప్రాంతాలకు వెళ్ళడం తిరిగి యింటికి రావడం, మళ్ళీ వెళ్ళడం, మళ్ళీ రావడం ఈ పనులతోనే సరిపోయింది ఆర్తర్‌కు. దీనికి ఆ "రక్షణా రాహిత్య భావమే" (feeling of insecurity) కారణం.

రంబో స్నేహితులకు రాసిన 132 ఉత్తరాలు అతని మరణానంతరం గ్రంథరూపంలో వెలువడ్డాయి. డా॥ ఎనిక్ స్టార్కీ రంబోపై, రచనలపై ఒకఉత్తమ గ్రంథం రచించాడు.

రంబో అత్యంత ప్రతిభావంతుడైన కవి ఎంతో శక్తివంతమైన ప్రతీకలతో కవిత రచించాడు. డిలన్ థామస్ (1914-53) అనే ఆంగ్లకవి రంబో రచనలను ఎంతగానో మెచ్చుకున్నాడు. 19 శతాబ్దపు చివరి పాదంలో ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మనీ మొదలైన దేశాలలో కవితారచన ఎలా వుండేదో తెలుసుకోవాలంటే రంబో రచనలు చదివి తీరాలి. అతడు సాధించిన క్లుప్తత, పదలాలిత్యం అందరికీ పట్టదు. రంబో రచనలలో ప్రారంభ అంత్యకాలాలకు చెందిన రెండు రచనల్ని ఇక్కడ ఉదహరిస్తున్నాను.

### కథాశకలం

"సూర్యుడింకా వెచ్చగానే వున్నాడు. కాని ప్రపంచాన్నిక వెలిగించలేడు. భూమికిదీపం. నిష్క్రమిస్తున్నాడు. తన అగ్నిశరీరంలోంచి చిట్టచివరి వెలుతురు కిరణాన్ని వెలవెలా ప్రసరిస్తున్నాడు ఆ వెలుతురులో చెట్ల పచ్చని ఆకులు, వాడిపోతున్న పూలు, శతాబ్దాల తరబడి నిలబడివున్న ముసలి పైన్ వృక్షాలు.... ఆకాశంలోకి ఎదిగిన పోప్లర్, ఓక్ వృక్షాగ్రాలు.... మసకకాంతిలో కనపడుతున్నాయి తాజాగా గాలి, స్వచ్ఛమైన మందవాయువు.... చెట్ల ఆకుల్ని చప్పుడు చేసేలా కదుపుతోంది. నా కాళ్ళ చుట్టూ నన్ను కావిలించుకుంటున్నట్టు గలగలాపారే సెలయేటి గంగలల వంటి మెత్తని చప్పుడు ! ఆ గాలికి ఫెర్న్ చెట్లు తలలు వంచుకున్నాయి. నిద్రపోయాన్నేను, సెలయేటి నీటితో సేదదేరకుండానే-

"కలగన్నాను....రైమ్స్‌లో (ఒక ప్రాచీననగరం) 1503లో పుట్టాను.

"అప్పుడు- రైమ్స్ ఒక చిన్న పట్టణం. లేదా ఒక చిన్న పేట అనొచ్చు. అందమైన చర్చిభవనాలు లేవు, క్లోవిస్ రాజుగారి పట్టాభిషేక చిహ్నంగా.

"మా తలిదండ్రులు అంత ధనవంతులు కారు, కాని చాలా గౌరవమర్యాదలు కలవారు. ఒక చిన్న యిల్లు తప్ప ఈ ప్రపంచంలో మరేమీ వాళ్ళకు లేదు. ఆ యిల్లు మాత్రం శాశ్వతంగా వాళ్ళదే. అది కాక

కొద్దివేల ఫ్రాంకులున్నాయి. దానికితోడు మా అమ్మ కూడబెట్టిన కొద్దిపాటి చిల్లరడబ్బులున్నాయి.

"మానాన్న రాజుగారి సైన్యంలో ఒక ఉద్యోగి. అశ్వదళాధిపతి. చాలా పొడవుగా, సన్నంగా ఉండే వాడు. చక్కని నల్లని తలవెంట్రుకలు. గడ్డం, నల్లగా కళ్ళు శరీరంకూడా నల్లగానే వుంటుంది నేను పుట్టే సరికి 48-50 కంటె ఎక్కువ వయసుండదు. కాని 58-60 వున్నట్టు కనపడేవాడు. ఎప్పుడూ, ఉల్లాసంగా చురుకుగా, అప్పుడప్పుడు కొంచెం కోపంగా కూడా వుండేవాడు. తనకు యిష్టంలేనిదేదీఒక్కక్షణం కూడా భరించేవాడు కాదు.

"మా తల్లి సంగతి వేరు. మధురంగా మాట్లాడేది. శాంత స్వభావురాలు. దేనికీ చలించేదికాదు. ఇంటిని చాలా చక్కగా నిర్వహించేది ఆమెను ముగ్ధమోహన మైన యౌవనవతిగా భావించుకుంటుండే వాడను కుంటాను-మా నాన్న.

"నేనంటే అందరికీ అమితమైన గారాబు. మా అన్నలు నావలె తెలివైనవారు గాని, చురుకైనవారు గాని కారు. నాకు చదువంటే అట్టే యిష్టం వుండదు. చదవడం, రాయడం, లెక్కలు చెయ్యడం ఇవేవీ యిష్టం వుండవు. కాని తోటపని, ఆటలు....ఓహో ! ఎంత యిష్టమో!

"నాకు బాగా గుర్తు. తనకు అవసరమయిన ఒక చిన్న భాగహారం లెక్కచేసి పెడితే కొనక్కుందుకు చిల్లర డబ్బులిస్తానని చెప్పాడు నాన్న. చేద్దామని మొదలు పెట్టాను. కాని చెయ్యలేకపోయాను. ఎన్ని సార్లు మా నాన్న నాకలా చెప్పాడో... ఎదయినా చదివి వినిపిస్తే...... మిఠాయిలు, ఆటవస్తువులు— ఒకసారయితే ఆయిదు ఫ్రాంకులుకూడాను యిస్తానని ఆశపెట్టాడు.

"ఇవన్నీ ఇలా వుండగా నాకు పదేళ్ళు రాగానే నన్ను బడికి పంపాడు.

"నాలో నేనే అనుకుంటూ వుండేవాడిని- ఎందుకు ఈ గ్రీకూ, లాటినూ నేర్చుకోవడం? ఏమీ ఉపయోగం లేదు. పరీక్షలు పాసయితే నాకు ఒరిగేదేమిటి? ఏమీ లేదు ! కాని పరీక్షలు పాసుకాక పోతే ఉద్యోగం రాదంటారు నాకు ఏ ఉద్యోగమూ అక్కర్లేదు. నాకు స్వంత రాబడి వుంటుంది. అలా ఏర్పాటు చేసుకుంటాను. ఉద్యోగం కావాలంటే మాత్రం లాటిన్ నేర్చుకోవడం దేనికి? ఆ భాష ఎవ్వరూ మాట్లాడరు. అప్పుడప్పుడు పత్రికల్లో లాటిన్ వాక్యాలు కనబడుతుంటాయి. నేను మాత్రం చచ్చినా పత్రికారచయితను కాను.

"మరి భూగోళమూ, చరిత్రా దేనికి ? ఫ్రాంసులో పారిస్ వుందని అందరికీ తెలుసును, కాని ఏ అక్షాంశ రేఖాంశముల మీద వున్నదని ఎవ్వడూ అడగడు. చరిత్ర మాత్రం దేనికి? సైరస్ రాజులు, అలెగ్జాండర్ చక్రవర్తి...కొన్ని పేర్లు ఎంతతమాషాగా వుంటాయి. ఎంత వికారంగా వుంటాయి ! ఎంత హింస అవన్నీ చదవడం? అలెగ్జాండర్ ఎంత ప్రసిద్ధుడయితే నాకెందుకు? పూర్వం రకరకాల జాతులవారుండేవారట. ఎవడు చూసొచ్చాడు-వున్నారనే అనుకుందాం-అయితే ఏమిటిట? నా గొడవా, నా సంపాదనా నాక్కావాలి గాని- ఆ జాతులు, వాళ్ళభాష- వాటితో నాకేంపనీ? నన్నిలా అర్థంపర్థం లేని చదువులతో హింసించడానికి వాళ్ళకి నేనేం అపచారం చేశాను——?

"ప్రాచీన గ్రీకు సంగతి చూద్దాం. ఈ మృతభాష ఎవ్వడూ మాట్లాడడు. ప్రపంచం మొత్తంలో ఒక్కడు కూడా మాట్లాడడు. ఓహో ! అదంతా నా కనవసరం. నా చదువు నాక్కావాలి. చదువులవల్ల వచ్చే ఉద్యోగం ఏదీ నాకొద్దు. ఆ దిక్కుమాలిన చదువు చదివితే. తన్నులూ గుద్దులేకదా బహుమతి. కుక్కా నక్కా ఎద్దూ అని తిట్టించుకోవాలికదా-అక్కర్లేదు నాకా చదువూ వద్దు, ఆ ఉద్యోగమూ వద్దు."

ప్రజాస్వామ్యం

(ఒక దేశాధినేత అన్నాడిలా :)

ఈ జెండా ఈ ఖండాలపు దేశానికిచాలు
మనం మాట్లాడే ఈ భాష
"మృదంగ ధ్వనుల్ని" ముంచెయ్యగలదు.
మన అంతరంగాల్లో
మన క్రౌర్యాన్ని, మౌఢ్యాన్ని
రహస్యంగా పెంచుకుందాం
న్యాయమైన తిరుగుబాట్లనన్నిటినీ
మొగ్గలోనే తుంచి- మట్టిలో తొక్కేద్దాం
సంపదలతో తులతూగే దేశాలపై
పారిశ్రామిక విజయం సాధిద్దాం
మిలటరీ తిరుగుబాటు చేద్దాం
మళ్ళీమనం కలుసుకుందాం
ఇక్కడో, ఎక్కడో- ఓచోట
విజ్ఞాన శాస్త్రానికి చాలాదూరంగా
స్వార్థానికి దగ్గరగా. చాకచక్యంగా
తీవ్రమైన కొత్తతత్వాన్ని మలుచుకుందాం
తక్కిన ప్రపంచాన్ని తన్నుకు చావనివ్వండి
ఇదే మన మార్గం !
పదండి ముందుకు- ఫార్వర్డ్ మార్చ్-

పైనుదహరించింది కధాశకలమే కాని- నిజానికొక కథ అనే చెప్పొచ్చు. పదేళ్ల వయసులో రాసినదది తల్లిదండ్రులపట్ల, విద్యావిధానంపట్ల ఆ వయసులోనే అతనికెట్టి భావాలుండేవో అర్థంచేసుకోవచ్చు.

'ప్రజాస్వామ్యం' అనే కవిత 18వ యేట రచించింది. ఈనాటి ప్రమాణాలతో చూసినా అది ఉత్తమ కవిత అని చెప్పవచ్చు.

నేను చేసిన అనువాదాలు బహుశా బలహీనమైనవి కావొచ్చు. రంబో రచన అంత సులభంగా తెలుగు చెయ్యబడదు. జిజ్ఞాసా దర్శనంకోసమే ఇది ఉదహరించాను. 19 ఏటనే రచన విరమించకపోతే మరెన్ని గొప్పరచనలు అందించి వుండేవాడో ! ప్రపంచకవి రంబో !

ఈ వ్యాసరచనలో నాకు ప్రధానంగా తోడ్పడిన రెండు గ్రంధాలు :


1. RIMBAUD-Introduced and edited by
OLIVER BERNARD with plain prose
translation of each poem [PENGUIN-1969]

2. A SHORT HISTORY OF FRENCH LITERATURE
by LAURENCE BISSON (PENGUIN PELICANS 1945)


ఫ్రెంచ్ సాహిత్య చరిత్రతో సంబంధంగల మరిరెండు, మూడు గ్రంధాలు కూడా నాకు కొన్ని వివరాలను అందించాయి.

తెలుగు లెక్చరర్
కోట వీధి
చోడవరమ్
విశాఖపట్నం జిల్లా 531 036

# బ్రదుకుజూదం

కన్నడ మూలం :
డా॥ మాస్తి వేంకటేశ అయ్యంగార్

తెనుగుసేత ;
శంకరగంటి రంగాచార్యులు

నా స్నేహితుడొకడు తన కూతురు పెళ్ళి విషయం ఆలోచిస్తూ వున్నపుడు అతడి అవ్వ అతడికి తెలిపిన ఒక సందర్భాన్ని నాకు తెలిపాడు.

అతడు ఆలోచిస్తూ చరచర నడుస్తూన్నాడు. అవ్వ "నాయనా ఏదో ఒక విషయంగా చాలా ఆలోచిస్తున్నట్లు అగుపిస్తోంది. ఏం సంగతి? చెప్పదగిన సంగతైతే, చెప్పు" అంది.

"మన లలితమ్మను చూసేందుకు రెండిళ్ళవాళ్ళొచ్చారు. ఒకబ్బాయి శ్రీమంతుల ఇంటివాడు. అంతేమీ చదువుకోలేదు. రెండోవాడు సామాన్యుల ఇంటివాడు; పిల్లవాడు చదువుకున్నాడు. శ్రీమంతుల కుర్రవాడు చూసేందుకు లక్షణంగా ఉన్నాడు. మరొకడంత అందగాడు కాడు ఎవ్వరికివ్వడం? మనస్సు ఒక నిర్ణయానికి రావటం లేదు. పిల్ల, లక్షణంగా వుండే పిల్లవాడిని ఒప్పుకుంటుంది. ఇంకొకడు వద్దనికాదు. అయితే వాడిని ఒప్పుకుంటుందనటానికి వీలులేదు."

"చూడు నాన్నా, ఇదంతా దేవుడు నడిపించేదారి, నా పెళ్ళిమాటే తీసుకో,. ఏమైందో విన్నావా?"

"లేదవ్వా. చెబుతావా వింటాను."

"మా వూరు మళవళ్ళి. మళవళ్ళి సీతారామయ్యగారు అంటారు కదా, వారు మా తాతగారు. మా నాన్నగారు అత్తిగుప్పకు దత్తువెళ్ళారు. నేనూ, నా తోబుట్టువులూ, అందరూ పుట్టి పెరిగింది అక్కడే. నేనింటికి పెద్దకూతుర్ని; పెళ్ళీడు వచ్చింది. తండ్రిగారు వారికి తెలిసిన వాళ్ళకు చెప్పారు. సరైన కుర్రాళ్ళు మీకు తెలిసివుంటే చెప్పండి. నేను సంగతులు కనుక్కొని, సంబంధాన్ని కుదుర్చుకుంటాను, అని. తండ్రిగారు దత్తుగా వచ్చిన ఇల్లు ధనవంతుల ఇల్లు. ఈ యింటికల్లుడుగా వచ్చేందుకు అందరికీ ఇష్టమే. నేను కురూపిని కాను. అంతో ఇంతో అందం కలదాన్నే. ఆదెలా సంభవించిందో ఏమో, ఒకరోజు అత్తిగుప్పకు మళవళ్ళి కుర్రవాడొకడూ, చెన్నరాయపట్టణం పిల్లవాడొకడూ పెళ్ళిచూపులకొచ్చారు. మళవళ్ళి కుర్రవాడు ఆంగ్లం చదువుకున్నాడు. చెన్నరాయపట్టణం పిల్లవాడు చదువులో లాభం లేదు; సంగీతం నేర్చుకుంటున్నాడు. అప్పుడు మైసూరులో మన ఆచార్యులుగారొకరుండేవారు. వారి ద్వారా ఇద్దరు కుర్రాళ్ళ పెద్దవాళ్ళు జాబులు వ్రాయించారు. "మా కుర్రాణ్ణి పంపించాము, భగవంతుడి దయవుండి కంకణబలం కలిసివస్తే ఈ సంబంధం కుదుర్చుకోవడం మాకు సంతోషదాయకం అంటూ. ఇద్దరూ ఒకేరోజురావాలా? వచ్చారు. తండ్రిగారు "ఇప్పుడెలా చెయ్యడం" అంటూ, ఆలోచిస్తున్నారు. మా తల్లిగారి పుట్టినిల్లూ అత్తిగుప్పయే ఆమె తమ్ముడు ఇంటికి వచ్చి వుండినారు. సగం హాస్యంగానూ, సగం గంభీరంగానూ, "ఈ పరిస్థితిలో నీవు ఏమి చేయదలుచుకున్నావ్, బావా; మధ్యాహ్నం ఇద్దరు కుర్రాళ్ళనీ రమ్మను; ఫలహారం ఇవ్వు పిల్లచూడనీ, ఎవర్నిష్టపడితే వాళ్ళని పెళ్ళాడనీ నీకెందుకు చింత?" అన్నారు. కానిమ్మని

తండ్రిగారు అలాగే ఏర్పాటు చేశారు. ఫల హారం చేసేటప్పుడు ఇద్దరూ పెళ్ళిచూపులకు వచ్చామని కుర్రాళ్ళకు తెలిసింది. కుర్రాళ్ళిద్దరూ ఉన్నంతలో అందగాళ్ళే. అందులో చెన్నరాయ పట్టణం పిల్లవాడు మరికొంత రూపవంతుడు. ఇదేమి, ఒక పిల్లకోసమై మేమిద్దరమూ పోటీపడాలా? ఇదొక స్వయంవరమా? అని ఇద్దరికీ అనిపించి వుండవచ్చు. అయితే, ఎవరూ ఏమీ మాట్లాడలేదు. ఫలహారం ముగి శాక లోకాభిరామాయణంగా, మామగారు, చెన్నరాయ పట్టణం పిల్లవాడిని, 'నేను పెళ్ళికొడుకుల్ని పరీక్షిస్తూ న్నాననుకోవద్దండి. మీరు సంగీతం నేర్చుకుంటు న్నారు కదా! ఒక పాటపాడండి, చూద్దాం' అన్నారు. పిల్లవాడు, 'కామకోటి సుందరా...' అన్న పాట పాడాడు. మరొక రిందుకు బదులుగా ఏమి చేయడం? మామగారు, "మిమ్మల్ని ఒక ఇంగ్లీషుపద్యం చెప్పండి అని అడగవచ్చు. పాట విషయం తెలిసినట్లు దాని విషయం మనకు తెలియదు' అన్నారు. కుర్రాడు 'ఔను' అన్నారు. కొంతసేపటి తర్వాత ఇద్దరికి తాంబూలాలిచ్చి పంపడం జరిగింది. నాలుగైదు రోజుల్లో జ్యోతిష్కుల నడిగి, జాతకాలు సరిపో యాయో లేదోచూసి చెబుతాము."అంటూ పెద్దవాళ్ళకు మా తరఫున విన్నపం చెయ్యండని మైసూరు ఆచార్యు లకు జాబు వ్రాయడం జరిగింది.

"జాతకాలు చూపించారు మళవళ్ళి కుర్రాడి జాత కమూ, నా జాతకమూ బాగా సరిపోయాయి. చెన్న రాయపట్టణం పిల్లవాడి జాతకమూ, నా జాతకమూ అంతగా సరిపోలేదు. మా తండ్రిగారు సరిపోయిన జాతకాన్ని ఒప్పుకుందామన్నారు. నేను తల్లిగారివద్ద 'నీవు నాన్నగారికి చెప్పమ్మా. నేనీ పిల్లవాడిని పెళ్ళాడతాను. పెళ్ళాడుదామనిపిస్తోంది. వాడిని పెళ్ళాడదామనిపించదు.' అని చెప్పాను. తల్లి నాన్న గారికి చెప్పింది. మంచిదంటూ చేద్దామా? పిల్ల ఇష్ట పడిందంటూ చేద్దామా? అంటూ నాలుగురోజులు మీన మేషాలెంచి, తండ్రిగారు నేను కోరినట్లు చేయడమే మంచిదని ఒప్పుకున్నారు. పెళ్ళైంది. ఆ చెన్నరాయ పట్టణం కుర్రాడే మీ తాతయ్య.

"ఆయన చెడ్డవారు కారు, నన్ను ప్రేమగా చూసు కున్నారు. అయితే వారికి ఈ సంగీతప్రపంచంలో పాటకత్తెల సాంగత్యమెక్కువై, వాళ్ళతో తిరగటం అధికమైంది. ఇలాంటి వాళ్ళతో ఎక్కువ సంబంధం కలిగి, ఎప్పుడూ వాళ్ళతో తిరుగుతూ, తప్పుదారి పట్టనివాళ్ళు చాలా అపురూపం. మీ తాతయ్య ఈ అపు రూపం మనుష్యులు కారు. ఇది తెలిసినప్పుడు నేను చాలా దుఃఖపడ్డాను. కుంగిపోయాను. కన్నీళ్ళు కార్చాను. కొన్నిరోజులు గడిచాయి. ఇదే అలవాటైంది. మదిలోని కష్టం మరుగున పడింది.

"చాలా ఏళ్ళు గడిచాయి. మీ తాతయ్య బెంగు ళూరులో సంగీతపంతులుగా స్థిరపడ్డారు అక్కడా, ఇక్కడా వస్తూ పోతూ వుండటంవల్ల రోగాలు తెచ్చు కున్నారు. ఒకరాత్రి వీరికి చాలా అపాయకరపరిస్థితి ఏర్పడింది. నాకు ఏమిచేయటానికి తోచలేదు. వైద్యు డిని పిలుచుకు రావాలి. వేరెవ్వరూ లేరు నేనే వెళ్ళాలి వెళ్ళాను. పక్కింటివాళ్ళనడిగి, డాక్టరుగారి ఇల్లు ఎక్కడనడం కనుక్కొని, నేనక్కడకు వెళ్ళాను. ఇంటివాకిట్లో ఒక బంట్రోతున్నాడు. నేను డాక్టరు గార్ని చూడాలయ్యా అన్నాను. వాడు లోనికి వెళ్ళి చెప్పాడు. డాక్టరు బయటికొచ్చారు. డాక్ట రెవరు ? నన్ను పెళ్ళిచేసుకుందామని వచ్చి, నేనొద్దు అన్నానే ఆ కుర్రాడే ! అదేముఖం, ఇంకొంచెం పెద్దగా వుంది. అదే గాంభీర్యం. 'ఏమమ్మా, ఏం కావాలి?' అని అడిగారు. వారికి నా ఆనవాలు దొరక లేదు. ఎలా దొరుకుతుంది? వారు నన్ను చూసినపుడు నేను పిల్లని. ఇప్పుడు ఇద్దరు పిల్లల తల్లిని ముఖమే వేరేమో అనేలా అయి వుంటుంది. అదీ అపుడు పిల్లను జాగ్రత్తగా చూసివుంచే కూడా. వారు నన్నలా చూసినవారు కాదు. పిల్లను తదేకంగా చూసే దుష్ట

స్వభావం కాదు వారిది. నేను 'మా శ్రీవారికి ఒంట్లో చాలా బాగా లేదు. ఆస్పత్రికి వెళ్ళి ఏదో మందు తీసుకుని ఈ రోజు అమితంగా బాధపడుతున్నారు. మిమ్మల్ని పిలుచుకుని వెడదామని వచ్చాను' అన్నాను 'వస్తానమ్మా' అంటూ వారు లోనికి వెళ్ళి, గుడ్డలు వేసుకుని, చేతిలో రోగపరీక్షకు కావలసిన అవేవో రెండు వస్తువులు తీసుకుని వచ్చారు. మాఇల్లు చేరారు. శ్రీవారి దగ్గరికి వచ్చి, వీరు వారిని చూశారు. వెంటనే నా వైపు తిరిగి "మీ పుట్టిల్లు అత్తిగుప్పేనమ్మా తల్లీ?" అని అడిగారు. నేను "ఔను" అన్నాను. వారు "వీరిని చూసి జ్ఞాపకం వచ్చింది. మిమ్మల్ని చూసి నప్పుడు ఇది తోచలేదు." అన్నారు. పడక ప్రక్కన కూర్చుని శ్రీవారిని నిదానంగా, జాగ్రత్తగా పరీక్షించారు లేచి "ఏం భయం లేదమ్మా, నేనొక మందిస్తాను. మూడు రోజులివ్వండి. గుణమవుతుంది." అన్నారు. నేను వారితోపాటు వాళ్ళ ఇంటికి వెళ్ళాను. వారు "నేను నా ఇంట్రోతును నాతోపాటు తీసుకు రావలసింది. వానితో మందు పంపించవచ్చునై వుండేది. వాడికి మీ ఇల్లు తెలీదు మీరే రావలసి వచ్చింది" అన్నారు. నేను "పూర్వ చరిత్ర నంతా మరచి దేవుడిలా మీరు మమ్మల్ని కాపాడటానికి వచ్చారు. మీతోపాటు నాలుగడుగులు నడవటం ఒక భాగ్యం" అన్నాను. వారు "అదంతా ఏం లేదమ్మా. మీరు సుఖంగా వుండటం ముఖ్యం. చిన్నప్పటి సంగతులు పది వుంటాయి వాటి నన్నింటినీ జ్ఞాపకం చేసుకుని మనస్సును పాడు చేసుకోవడం మంచిదా?" అన్నారు. నేను, వీరు దేవునిలా లేరు, దేవుడే వచ్చాడు అనుకున్నాను. మందు తెచ్చి శ్రీవారికిచ్చాను. వారికి గుణమైంది."

ఇక్కడ నాకు కొంత కుతూహలం. అవ్వ వద్దన్న కుర్రాడికి ఎలాంటి భార్య దొరికింది?

అవ్వ చెప్పింది : "నేను వీళ్ళింటి కెళ్ళిన తొలి రోజే ఆమెను చూశాను. శ్రీవారు ఎక్కడికో వెడుతున్నారని వీరిని సాగనంపటానికి ఆమె గారు తలవాకిలి వరకూ వచ్చారు మంచి అందగత్తె. మంగళగౌరి. నేను వద్దన్న పిల్లవాడు నాకన్నా అందగత్తెనే వివాహం చేసుకున్నాడు "

"తరువాత ఏమైందవ్వా?"

"తరువాత చాలా ఏళ్ళు నేను వీరిని చూడలేదు. మీ నాన్న మైసూరులో పనిలో వున్నప్పుడు ఒకసారి నాకు ఒక రకం జ్వరం వచ్చింది. లక్ష్మీపురం ఆస్పత్రి డాక్టరు, ఈ జ్వరం విషయం కచ్చితంగా తెలిసేటందుకు మా పెద్ద డాక్టర్ను పిలవడం మంచిది అని వారిని పిలుచుకు వస్తానన్నారు. పిలుచుకుని వచ్చారు, పెద్ద డాక్టరు వచ్చారు. ఎవరు వారు? ఇదే పెద్దమనుషులు. నన్నుచూసి వారికి ఆశ్చర్యం. 'ఇదేం తల్లీ, నేను మిమ్మల్ని చూడటం ఎప్పుడూ మీరు రోగగ్రస్తులై ఉన్నప్పుడే అన్నట్టు అగుపిస్తుందే' అంటూ నవ్వారు. నేనూ నవ్వాను. 'ఏమి సంగతమ్మా, ముఖం కళావిహీనంగా కానవస్తుంది కదా?'

'శ్రీవారు మూడేళ్ళక్రితం పరలోకం వెళ్ళారు '

'అయ్యోపాపం! మధ్యవయస్సు. నేనూ, వారూ ఒకే వయస్సువాళ్ళం. ఇంత త్వరగా పరమపదించారా? భగవదిచ్ఛ. ఇపుడు మీకీ జ్వరం చూద్దాం, దీనిసంగతేమో?' ఇలా అంటూ వారు పడకప్రక్కన కూచుని, నాడి చూసి, నాలిక చూపండని అడిగి, కళ్ళరెప్పల్ని పైకిలాగి, కళ్ళవైపు తదేకంగా ఒక నిమిషం చూసి, చిన్నడాక్టరుకు, ఇది ప్యారా టైఫాయిడ్ అయి ఉండాలి డాక్టర్. భయపడే అవసరం లేదు, సుమారు మూడు వారాలు జరగాలి. చూసుకోండి గుణమౌతుంది. అమధ్య అవసరమైతే నన్ను చూడండి' అన్నారు. 'నేనొస్తానమ్మా' అంటూ చెప్పి వెళ్ళారు మరునటి రోజు మా పిల్లవాడు చిన్నడాక్టరు మాట చొప్పున వీరివద్దకు వెళ్ళి, నిన్నరాత్రి వచ్చినందుకు ఫీజని పదిహేనురూపాయలు బల్లమీద

పెట్టాడు. వారు 'ఇది ఫీజు తీసుకునే కేసుకాదయ్యా! మీ తల్లిగారిని నేను చిన్నతనం నుంచీ ఎరుగుదును. డబ్బు జేబులో పెట్టుకోండి. ఆమెకు ఔషధోపచారాల కోసం దీన్ని వాడండి, అన్నారు.

నీవు పదేళ్ళ పిల్లవాడివి. ఒకరోజు ఎందుకో ఆరోగ్యం చెడి, ఎంగిలి మింగేందుకు కాదని పడుకున్నావు. బాగా జ్వరం వచ్చింది. మన డాక్టరు రోగమేదన్నదీ తెలీలేదని చెప్పారు. మీ పెదనాన్న పెద్ద డాక్టరు నాకెలాగూ తెలుసుకదా అని వీరివద్దకు వెళ్ళాడు. వీరిని తీసుకొచ్చాడు. అప్పుడు వీరికి పని నుంచి విశ్రాంతి పొందే వయస్సు. అయినా ముసలివారు. పిల్లవాడి కన్నా చురుకుగా ప్రవర్తించే వారు, వెంటనే వచ్చారు, నిన్ను చూశారు, 'గొంతులో ఏదో తెల్లగా చుక్క కనబడుతూ వుంది. ఇది డిఫ్తీరియా, ఒక ఇంజక్షన్ ఇవ్వండి' అంటూ మన డాక్టరుకు చెప్పారు. డాక్టరు 'అయ్యో, నాకు తోచనేలేదేం, డిఫ్తీరియా రోగం నాకు తెలుసు. అయితే ఇది అరుదైన రోగం. దీన్ని గుర్తించడం కష్టం. చాలాఅపాయకరమైన రోగం. అనుభవజ్ఞులు వచ్చారు. పిల్లవాడు బతికాడు.' అన్నారు.

అప్పుడు ఈ మాటను పదిసార్లు వినడం వల్ల ఇపుడింత సులువుగా డిఫ్తీరియా, డిస్టీరియా అంటూ పదిసార్లు చెబుతున్నాను ఇలాగ పెళ్ళిచూపులకు వచ్చి వద్దనిపించుకున్న కుర్రవాడు, తరువాత బ్రతుకులో పెద్దవాడై, మూడుమార్లు వచ్చి నా భర్తను కాపాడారు, నన్ను కాపాడారు, నా మనుమడిని కాపాడారు. దీన్ని నేను అతడి ఇష్టం ప్రకారం నడిచింది అనుకోవాలా నాయనా, అదికూడా ఉండొచ్చు. అయితే నాకనిపించేది ఇలాగ. నేను, ఇతడు వద్దు ఇంకొకడు కావాలి అని భర్తను వరించాను. నాన్నగారి మాట వినివుండి వుంటే ఈయన భార్యగా వుండేదాన్ని. దేవుడు నీవు నడచిన తీరు చక్కగా వుందా, అని అడిగేందుకు వీరిని ఈ మూడుసార్లూ నా బదుకులో తరువాత నా దగ్గరికి పిలుచుకు వచ్చాడనే అనిపిస్తుంది. కాదని ఎలా చెప్పడం. అందరి బదుకుల్లోనూ ఇలాంటి విచిత్రం కనిపిస్తుందనీ, లేక జరుగుతుందనీ కాదు. ఒక బదుకులో కనిపించినపుడు, ఉండొచ్చు అనడమే సరైందనిపిస్తుంది. పెద్దలు చెప్పారు, మనకు ముందర జరుగుతుందనే సంగతి దేవుడి మనస్సులో అప్పుడే జరిగిపోయిందని. దాన్ని తప్పించేవాళ్ళెవరు? ఏవిషయంగానూ, ఏమిచేయాలని మనం ఎక్కువగా చింతించి లాభంలేదు. నీవు సరైన ప్రేరణ నివ్వాలి అని దేవుడిని ప్రార్థించాలి. కలిగిన ప్రేరణకు అనుకూలంగా నడవాలి మన బదుకు ఒక జూదం పాచికలు మనం వేస్తాం. పందెం పడటం మన అధీనంలో లేదు. దాని దొర వేరేవున్నాడు. సరైన ప్రేరణఇవ్వు; పిల్ల బదుకును చక్కబరచు- అంటూ దేవుడిని వేడుకో.

అవ్వ అనుభవంతో చెప్పినమాట. నా మనస్సు దాన్ని అంగీకరించింది. నేను ఆలోచించడం మానుకున్నాను. దేవుడి ముందు నిలబడి ప్రేరణ ఇమ్మని ప్రార్థించాను. ప్రేరణ కలిగింది. దాని కనుగుణంగా నడిచాను. కూతురుపెళ్ళి జరిగింది. అలా మగడూ సుఖంగా వున్నారు.

అవ్వ ఇప్పుడు లేదు. ఆమె చెప్పిన బుద్ధివాదం ఇప్పుడు కూడా నా బదుకు వెలుగై, నన్ను కాపాడుతోంది.

హెడ్మాష్టర్, జిల్లా పరిషత్ హైస్కూల్,
రాళ్ళహల్లి
మడకశిర తాలూకా
అనంతపూర్ జిల్లా 515 305

# ఉద్భటారాధ్య చరిత్ర- కొన్ని ధర్మ సందేహాలు

— బేతవోలు రామబ్రహ్మం

తెనాలి రామలింగ కవి రచనగా ప్రసిద్ధిపొందిన ఉద్భటారాధ్య చరిత్రను తొలిసారిగా ముక్త్యాల సంస్థానం వారు మహిష్మతీ ముద్రణశాల నుంచి క్రీ. శ. 1925 లో ప్రచురించారు. దీనికి వేటూరి ప్రభాకరశాస్త్రి గారు పీఠిక రాశారు. ఆటు తరువాత మళ్ళీ క్రీ శ. 1974 లో "ది లోటస్ పబ్లిషర్స్"– తెనాలి వారు దీనిని ప్రచురించారు. దీనికి నిడదవోలు వేంకటరావుగారు సుదీర్ఘమయిన పీఠిక రాశారు. (వీరి పీఠికలకు సుదీర్ఘమైన అనే విశేషణం నిజానికి అనవసరం "నిడుద పీఠుల ప్రోలు శ్రీ నిడదవోలు" అని గదా ప్రసిద్ధి !)

ఈ పీఠికా కర్తలిద్దరూ కూడా తెనాలి రామలింగడూ రామకృష్ణుడూ వేరు వేరు వ్యక్తులు కాదనీ ఒక్కడేననీ స్థాపించారు. ఆదిలో శైవుడై ఆటుపైని వైష్ణవమతం పుచ్చుకొని రామకృష్ణుడుగా మారిపోయాడు అనే వేటూరి వాదాన్ని నిడదవోలు వారు అంగీకరించలేదు. పేరు మార్చుకున్నాడే కానీ మతం మార్చుకోలేదనీ, సింగయ్య సింగవ్వ శ్రియాదేవి మొదలయిన వైష్ణవ నామాలతో చాలామంది శైవులు ఉన్నారనీ, కాబట్టి రామకృష్ణుడు అన్నంత మాత్రాన వైష్ణవుడు అయిపోలేదనీ వీరి వాదన. ఎఱ్ఱన్న పోతన్నల్లాగా ఇతడుకూడా శైవుడే అయినా విష్ణుకథను తీసుకొని ఆ పారిభాషిక సంప్రదాయాలతో పాండురంగ మాహాత్మ్యమూ ఘటికాచల మహాత్మ్యమూ రాశాడే కానీ "ఆతడెంతమాత్రమును వైష్ణవ మతమును స్వీకరించి వైష్ణవుడు కాలేదు" అని వీరు నిర్ధారించారు.

ఇతడు మతం మార్చుకొన్నాడా పేరు మాత్రమే మార్చుకొన్నాడా అసలు శైవుడా లేక వైష్ణవుడా అనే చర్చ చేసే ముందు ఆలోచించవలసిన సంగతులు కొన్ని ఉన్నాయి. రామలింగడు అనే పేరుతో శైవుడుగా ఉండగా రాసిన శైవ ప్రబంధమైన ఈ ఉద్భటారాధ్య చరిత్రలో వైష్ణవ ప్రసక్తి చాలా ఉంది. వల్లకీ పురాధిపతి, పరమ మాహేశ్వరుడూ అయిన ప్రమథేశ్వరుడు ఈ ప్రబంధంలో శివుణ్ని పురుషత్రయాత్ముడుగా స్తుతించాడు. (ఉద్భట 3-27) ఇతనికి ఈశ్వర వరప్రసాదంగా పుట్టిన కుమారుడు "విశ్వరక్షాదితిజారి మూర్తి" వలె ఉన్నాడుట (3-45) చివరలో– ముంజ భోజుడు చేసిన స్తోత్రంలో "విష్ణుఁడన రుద్రుఁడనఁగ వాగ్విభుఁడనంగ దగిన నామాంతరంబులు దాల్చి" నీలకంఠుడు ఉంటాడని చెప్పాడు (3-281) శివుణ్ణీ శివభక్తుణ్ణీ అందగాళ్ళుగా చెప్పవలసిన చోట్ల చాలాసార్లు మన్మథుణ్ణి ఉపమానంగా స్వీకరించాడు. "మోక్షలక్ష్మి" అని పలు పర్యాయాలు వ్యవహరించాడు. ఇవన్నీ ఈ కవిని అద్వైతిగా నిర్ధారిస్తున్నాయి. విష్ణుపారమ్యాన్ని ప్రతిపాదించే పాండురంగ మహాత్మ్యంలో శైవ ప్రసక్తి కూడా చాలా ఉంది. అసలు ఆ కథ శివుడు పార్వతికి చెబుతున్నట్టు నడిచింది. కాబట్టి ఈ కవిని వీరశైవుడు అనిగానీ వీరవైష్ణవుడు అనిగాని అనలేము. భేదములేని భక్తి కలవాడు గానే భావించాలి.

కాగా ఉద్భటారాధ్య చరిత్రలోని కథకు సంబంధించి కొన్ని ధర్మసందేహాలు ఉన్నాయి. వాటిని పాఠ

కులముందు ఉంచడం ఈ వ్యాసానికి ప్రధాన లక్ష్యం. ఈ ప్రబంధాన్ని ప్రచురించడంలో తాళపత్ర ప్రతులను సంపాదించడమూ మేలి ప్రతి తయారుచేయడమూ శిథిల భాగాలను పూరించడమూ వగయిరాగా అయా పెద్దలు పడిన శ్రమను ముందుగా గుర్తించడం ఈ లక్ష్యసాధనకు అత్యవసరం.

వేములపల్లి వాస్తవ్యులు శ్రీ ములుగు సుబ్రహ్మణ్య శాస్త్రిగారు నైజాం మండలం నుంచి ఉద్భటారాధ్య చరిత్ర తాళపత్ర ప్రతిని ఒకదానిని సంపాదించి శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారికి ఇచ్చారు. అది చాలా శిథిలావస్థలో ఉంది. అటు పైని తాడికొండ వాస్తవ్యులైన శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారు మరొక ప్రతిని సంపాదించి వీరికే ఇచ్చారు. (ఇది ఎక్కడ దొరికిందో తెలుపలేదు.) ఇందులో ద్వితీయాశ్వాసం అసలే లేదు. ఒకటి-మూడు ఆశ్వాసాలు ఉన్నాయి. అవీ శిథిలావస్థలో ఉన్నాయి. ఈ రెండు ప్రతులనూ సంప్రదించి ఒక ప్రతిని శ్రీ ముదిగొండ బసవయ్య శాస్త్రిగారు ఎత్తి వ్రాయించారు. అటుపైని పెదనవాస్తవ్యులైన శ్రీ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారు లేఖక ప్రమాదాలను సవరించి లుప్తభాగాలను చాలావరకూ పూరించడం జరిగింది. దీనిని ముద్రించే ప్రయత్నంలో ఉండగా శ్రీ వేటూరి వారు రావడమూ మేలిప్రతిని వారికి ఇవ్వడమూ దానిని ముక్త్యాల సంస్థానం వారు ప్రచురించడమూ జరిగింది. దీని విజ్ఞప్తిలో శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు పై విశేషాలన్నింటినీ తెలియజేశారు. ఈ విజ్ఞప్తి (కొంత భాగం) ద్వితీయ ముద్రణ పీఠికలో ఉదాహరించబడినది.

తొలి ముద్రణ పీఠికలో వేటూరి వారు దీని తాళపత్ర ప్రతులను గురించి ఏమీ ప్రస్తావించలేదు. బహుశః వాటిని వీరు చూసి ఉండరు. ఎత్తి వ్రాయించిన మేలిప్రతినే వీరు చూశారు. ద్వితీయ ముద్రణ పీఠికాకర్తలు కూడా తాళపత్ర ప్రతులను తాము చూసినట్టు రాయలేదు. ప్రథమ ముద్రణం లోని కొన్ని లోపాలను సవరిస్తూ ద్వితీయ ముద్రణం సాగినట్టు మాత్రమే చెప్పారు.

ఇంక ద్వితీయ ముద్రణం సంగతి. తెనాలి వాస్తవ్యులయిన శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు దీని ముద్రాపకులు. ప్రథమ ముద్రణంలో మిగిలిపోయిన శిథిల భాగాలను (ఖాళీలను) శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి గార్లతో పూరింపజేసి, శిథిల పూరణాలను అన్నింటినీ కుండలీకరణాల్లో చూపిస్తూ వీరు దీనిని తెనాలి నుంచి ప్రకటించారు. దీనికి నిడుదవోలు వారు పీఠిక రాస్తూ ముదిగొండ వారిని వేనోళ్ళ ప్రశంసించి "శైవ సంప్రదాయములు దక్క వేరెఱుంగను పండితులార! నేను" (పుట-199) అంటూ తమ అర్హతను కూడ ప్రకటించుకొన్నారు.

పాల్కురికి సోమనాథుడు బసవపురాణంలో సంగ్రహంగా చెప్పిన కథ ఈ ప్రబంధానికి మూలం. అనగా అనగా "బల్లకి" అనే పట్టణం ఉంది. అక్కడ "ఉదుబటుడు" అనే ఒక భక్తుడు ఉన్నాడు. అతడు భోజ రాజు అనే నరనాయకునికి గురువై శివదీక్ష ఇచ్చాడు. ("—అదిగాక "బల్లకి"యను పురంబునను నుదుబటుడనఁనొప్పు నొక్కభక్తుండు, వరభోజరాజను నరనాయకునకు గురువయి శివదీక్ష గరుణించి మరియు-బసవ-సప్తప.) ఈ భక్తునికి బొమ్మవ్వ (జొమ్మవ్వ) అనే భార్యఉంది. ఆమె ప్రాణేశు సద్భక్తి పరురాలు. కులహీనులతో ఇతడు కూడిఉన్నాడు. ఇతని గొప్పదనాన్ని ప్రజలూ రాజూ కొనియాడారు. శివుడు ఇతని భక్తిమహిమను ఈ భూమిలో అరుదుగా మెరయించడంకోసం తనలో కలుపుకొన్నాడు. ఇతనికి దహనక్రియలు చేస్తూంటే ఆ పొగసోకి సమీప వటవృక్షం మీద ఉన్న ఏడువేల భూతాలు కైలాసానికి పోయాయి. ఒకభూతం ఆసమయంలో ఆహారంకోసం పోయింది. దానికి పొగసోకక అది మిగిలిపోయి ఏడుపు మొదలుపెట్టింది. అదివిని భోజరాజు వచ్చి

దాని కథ తెలుసుకొని చితిలో మరికొన్ని కట్టెలువేసి పొగసోకిస్తాడు. ఆ భూతం మఱ్ఱిచెట్టుతోసహా ఊడ పెరుక్కొని కైలాసానికి పోతుంది. ఇదీ మూలకథ.

తెనాలి రామలింగకవి ఇందులో కొన్ని మార్పులూ చేర్పులూ చేశాడు భోజరాజును "ముంజభోజుడు" అన్నాడు. ఇతని తండ్రిపేరు ప్రమథేశ్వరుడు. ఇలా మరొక తరాన్ని కలిపాడు. వీరంతా శివభక్తులు. (1-166) వల్లకి పట్టణాన్ని వీరి రాజధానిగానే వర్ణించాడు. (1-149) మూలకథలో ఇది ఉద్భటుని నివాస పట్టణం.

ఉద్భటుని జన్మవృత్తాంతాన్ని సోమనాథుడు చెప్ప లేదు. రామలింగడు చెప్పాడు. శివుని మానస పుత్రుడుగా ఇతడు జన్మించాడు. శివుని సంకల్పమాత్రంతోనే ఇతడు మనస్సునుంచి ఆవిర్భవించాడు, (1-183). ఈ కవి ఇతడిని ప్రస్తావించినచోటుల్లో "మానస పుత్రు" (1-187); "మదన ధ్వంసి మనంబునంబొడమి" (3-272); "ఆత్మోద్భవుం గూర్చి" (3-303) అంటూ అంతటా మానస పుత్రుడుగానే చెప్పాడు తప్ప ఇతనికి తల్లి దండ్రులు ఉన్నట్టు ఎక్కడా పేర్కొలేదు. పైగా ఇతడు పుట్టడమే అన్నివిధాలా శివుడికి ప్రతిబింబంగా పుట్టాడు. అది చూసి నువ్వు ఈ రూపంతో భూలోకంలోకి వెడితే "జనులత్యంతంబు భీతిల్లి సారెకు నిల్పోపరుగాన మానుషవపు(శ్శ్రీ)ఁ జెంది పొమ్మిమ్ములన్"(1-196) అని శివుడు ఆజ్ఞాపించాడు. భూలోకంలో ఇతడు ఎలా ఉండాలో ఏమేమి చెయ్యాలో కూడా శివుడే నిర్ణయించాడు.

సంసార యోగివై పర
హింసకులోనీక వసుధకేగియు జీవో
త్తంసుడవగుచు దిక్కుల
మాంసలసత్కీర్తిఁ దెలుపుమా గురుముఖ్యా ।
(1-197)

నాశాపంవల్ల భూతాలయిన దేవకుల మహనీయులు ప్రమథేశ్వరుడు ఏలుతున్న వల్లకిలో ఉన్నారు. వారిని బ్రోవుము.(1-198) నీకు ఆరాజు కూర్మి పట్టి ముంజ భోజుడు ప్రియశిష్యుడు అవుతాడు. (1-200) ఇదీ శివుని ఆజ్ఞ.

ద్వితీయాశ్వాసంలోని తొలిపద్యం "అనిపలుకంగఁ దావినతుడై తగమాఱునదించి వేడ్కఁజెందిన మది వాఁడు వేగఁజనుదెంచె ధరిత్రికదృశ్యమూర్తియై" అనేది ఖచ్చితంగా అన్వయిస్తోంది. "రాజసతయును బ్రహ్మవర్చసము గలిగి యుద్భటుండీశ్వరాకృతినుర్వి నిల్చె" (2-4) అనీ, శివుని ఆజ్ఞతో కొందరు ప్రమథులు కూడా ఇతనితో విప్రులుగా భూమికి వచ్చారనీ (2-5) వారందరితో కలిసి శైవమత ప్రచారం చేస్తూ "ప్రబలి విహరించు నుద్భటారాధ్య వరుఁడు" (2-6) అనీ రామలింగడు స్పష్టంగా చెప్పాడు.

దీనినిబట్టి ఉద్భటుడు గర్భవాస నరకం అనుభవించలేదనీ, శివునికి మానస పుత్రుడనీ, ప్రాప్తయౌవనుడై భూమికి అవతరించాడనీ, ఈ ఆ పట్టణం అనకుండా వసుధ అంతా సంచరించి స్వమత స్థాపన పరమత ఖండన చేశాడనీ స్పష్టంగా తెలుస్తోంది.

కానీ ముద్రిత ప్రతులు రెండింటిలోనూ ప్రథమాశ్వాసం చివర ముదిగొండ పట్టణం ఉద్భటుని భావి తరాలకు ధామం అవుతుందనీ, వారంతా ఆరాధ్యగురు సార్వభౌములు అవుతారని, ముదిగొండపురవరాధ్యతులగుచు వెలయగలరనీ శివుడే చెప్పినట్టు మూడు పద్యాలు ఉన్నాయి.

గోపతి నెక్కి మంచుమల కూతురితో నిటయున్కి మాని నే
నేపురిఁ గాఁపురంబు వసియింపుదు నా ముదిగొండ పట్టణం
బో పురుషాగ్రగణ్య! భవ దుత్తమ వంశజులున్ దపోధన

శ్రీపులునైన ధీరులకుఁ బ్రేమపదంబగు ధామ
మయ్యెడిన్. (1-201)

ఇందులో వసియింతును అనే అర్థంలో వసియిం పుదు అనడమూ తపోధన శ్రీపులు అనే సమాసమూ కొంచెం ఆలోచించదగినవిగా ఉన్నాయి. అది అలా ఉండగా ప్రధాన కథాసూత్రంతో ఈ మూడు పద్యాలు ఇమడడం లేదు. పైగా ముదిగొండలో శివుడు తాను విహరిస్తున్నట్టు ఇదే మొదలు చెప్పడం. ఒకవేళ శివు డికి ఇది విహార పట్టణమే అయినా, లేదా ఉద్భటుడికి నివాసమే అయినా దీనిని ఇలా మాటమాత్రంగా చెప్పేసి ఈ కవి ఊరుకొన్నాడు అనడం అసంభవం. భావితరాలకు అది ధామమవుతుంది అనడంలో అంత ర్యం ఉద్భటునికి ప్రస్తుతం నివాస పట్టణ మయ్యింది అనే గదా! మరి అటువంటి పుణ్య పట్టణాన్ని అస్సలు ఏ కొంచెమూ వర్ణించకుండా రామలింగడు విడిచి పెడ తాడా! కాబట్టి ఈ పద్యాలు ప్రక్షిప్తాలు కాదు గదా! అనేది నా మొదటి ధర్మసందేహం.

పైగా సోమనాథుడు చెప్పిన మూలకథలో ఉద్భ టుడు బల్లకిలో ఉన్నాడు. ఇతనిని ఒక పట్టణానికి కట్టి ఉంచడం ఇష్టం లేకనే వసుధ అంతా సంచరించి నట్టు తెనాలి రామలింగకవి మార్పు చేశాడు మరి అటువంటప్పుడు ముదిగొండ నివాసమూ అది కార ణంగా భావితరాల పావిత్ర్యమూ కథతో సంపదించడం ఎలా?

కథాంతంలో ఈ ఉద్భటుడు "యోగంబుచే మస్తో ద్భేదము చేసి" (8-251) జీవితము చాలించినట్లు కవి వర్ణించాడు. "శతకోటి రవి దీప్తి విలసనంబు గలుగు తేజంబు" అతని చేతిలోని శివలింగంతో కలిసి శివుణ్ణి పొందింది. (8-252) "అమ్మహనీయ మూర్తి తనువందలి ధూమము" సర్వదిక్కులకూ వ్యాపిం చింది (8-254) అది సోకి భూతాలు ఖేచరులయ్యారు. ఇతడు యోగాగ్ని దగ్ధుడయ్యాడు అనే విషయాన్ని ఈ కవి ఇలా స్పష్టం చేశాడు. చితి పేర్చవలసిన అవసరం కలగలేదు. ఆ అవసరం కలిగించటం ఉద్భటుని మహత్తును కించ పరచడమే అవుతుంది. అందుకే అప్పటికి ఆహారార్థం వెళ్ళి ఉండటం చేత ఖేచరత్వాన్ని పొందకుండా మిగిలిపోయిన ఒక్క భూతానికి ముక్తి ఇప్పించడం కోసం ఈ మంజు భోజుడు శివుణ్ణి ప్రార్థించాడు. లేక పోతే మూల కథలో లాగానే చితి ఉండి ఉంటే అందులో మరిన్ని పుడకలు వేసి పొగ రప్పించవచ్చు. అలా చెయ్య లేదు. కాబట్టి చితిలేదనీ, యోగాగ్ని దగ్ధుడయ్యాడనీ ఈ కవి భావనగా తెలుస్తోంది. దీనినే "శైవాగ్ని" (8-308) అని ఈతడు పేర్కొన్నాడు. కాగా ఈ సందర్భంలో ముద్రిత ప్రతులు రెండింటా ఈ క్రింది పద్యం కనబడుతుంది—

జితభవ బంధనులగు త
త్సుతు లధికులు శాస్త్ర సరణితోఁ దత్తనువున్
జతురత శైవ జ్ఞానా
హుతిగా భావించిరంత యోగ్యప్రాజ్ఞుల్(8-258)

ఇందులో ఉద్భటునికి పుత్రులు ఉన్నట్టు చెప్ప బడింది. ఇది కుదరని విషయం. ఉద్భటుడికి జొమ్మవ్వ అనే భార్య ఉన్నదనీ, ఆమె హీనకులజ అనీ మూలకథ, దానిని కావాలనే ఈకవి విడిచి పెట్టాడు. వివాహమే జరిగిఉంటే నాయకుని వివాహాన్ని వర్ణించకుండా కవి విడిచిపెట్టడు. వివాహ ప్రసక్తి ఎక్కడా చెయ్యలేదు. "సంసార యోగివై" అనే శివుని ఆజ్ఞలో సంసార శబ్దం ప్రపంచార్థకం మాత్రమే. భార్య ఉండి ఉంటే ఈతని మృతి సమ యంలో ఆమె దుఃఖించడమో సహగమించడమో లేక పోతే తలకెక్కిన వైరాగ్యంతో చేష్టలుడికి నిలిచిపోవ డమో- ఏదో ఒకటి జరిగి ఉండాలిగదా ! ఏమీ చెప్ప లేదు ఈ కవి. తొలినాటి శివుని ఆజ్ఞలో లేకపోవ డమూ, కవి వర్ణించకపోవడమూ కారణంగా ఉద్భటు

దికి వివాహం అయ్యింది అనడానికి వీలులేదు. మరి సుతులు ఎక్కడనుంచి వచ్చారు? సుతులు లేకపోతే ముదిగొండ ఊరు మీదగా ఆరాధ్య వంశానికి ఉద్భటుడు మూల పురుషుడు అయ్యే అవకాశం లేదు కాబట్టి ఈ సుతులు ఇక్కడ చోటుచేసుకున్నారేమో అనేది నా మరో ధర్మసందేహం.

శివుణ్ణి స్తుతించి ప్రత్యక్షం చేసుకొని ముంజభోజుడు ఆ మిగిలిన ఒక్క భూతానికి ముక్తి ఇప్పించడంతో కథ పూర్తి అయిపోయింది. "అనవుడు నమ్మహర్షులు హర్షంబున నారోమహర్షిణి కిట్లనిరి. (8–298) "మున్నుద్భటారాధ్యులకు సంతానంబు గలదని తన్నిర్యాణ కాలంబునం గొంత వివరించితి నమ్మహావంశంబు వర్థిల్లు తెఱంగెఱింగించి మమ్ము గృతార్థులం జేయ వేయనుడు నతండమ్మహర్షుల కిట్లనియె" (8-300) అని మళ్ళీ ప్రారంభించడం జరిగింది. ఈ ఘట్టంలో "శంక యొకింతలేక" (8-318) అనే పద్యంతో ప్రారంభించి "వరశమాకర లబ్ధ (8-32?) అన్నంతవరకూ ఉన్న పద్యాల్లో దోషాలు కోకొల్లలు.

"భవ్యశంకర దానముల్ ఒసఁగి" "కాంక్షనుతించిరే "రాజమంత్రి సచివ వ్యాపార ముఖ్యుల్"కోటి మన్మథ సమగ్రాఙ్గంగునిన్ ఉద్భటున్"; "సేవించీశ్వర" "దానముల్ ఒసగి"; "నిత్య సీమముల్" వంటి ప్రయోగాలు ఈ పద్యాల్లో ఉన్నాయి. తరువులు అనడానికి "తర్వులు" (2-158) అనడం. "కలకంఠి నెన్నడు కలుతు నొక్కొ" (2-177); మదిఁ బర్వితి" (1-190); చేరువ "చేర్వ" (1-122)—ఇలాంటివి ఒకటి రెండు ఉన్నా సంధి దోషాలూ సామాసిక దోషాలూ ఈ ప్రబంధంలో ఇంక ఎక్కడా లేవు. అన్నీ ఈ పైని పేర్కొన్న పది పద్యాల్లోనే చోటు చేసుకొన్నాయి. ఉద్భటునికి వివాహం అయ్యింది అని చెప్పే పద్యం కూడా వీటిలోనే ఉంది—

తద్బుధులలో సుబుద్ధియన్ ధరణి సురుఁడు
సుగుణమణి గుణ సౌభాగ్య సుందరియను
పేరు గలిగిన కూతురఁ బెండ్లి చేసె
నుద్భటారాధ్యునకు నీశ్వరుండు తెలుప (8-318)

ఏ కవి అయినా నాయకుని వివాహాన్ని అందునా శైవుడయిన కవి ఉద్భటుని వివాహాన్ని ఇలా ఒక్క తేటగీతితో ఇంత సంగ్రహంగా లాగించేస్తాడా! "సౌభాగ్య సుందరి" అనేది ఆమె పేరుట, సుబుద్ధి ఆమె తండ్రి పేరు. అతడు ధరణీసురుడు. అయిపోయింది అంతే. ఈ తేటగీతిలో నాల్గవ పాదంలో యతి భంగం భంగం కాదు అసలు తప్పింది. పైగా మిక్కిలి ఇది ఈశ్వరాజ్ఞ. కృతి సందర్భంగా సుతులను ఒక పద్యంలో అవసరార్థం ప్రస్తావించడం జరిగింది కాబట్టి ఇక్కడ ఈ వివాహం. అదీ ఇదీ కూడా ప్రక్షిప్తాలే అనడానికి ఇంతకన్నా ఆధారం ఏం కావాలి!

ఇవి ఇలా ఉండగా "లాగించు" అనే క్రియను అపహరించు అనే అర్థంలో వాడడం జరిగింది. "కాఁగాదు దేవధనమని లోఁగక లాగించి యడవి తోతెరువున...." (2-188). సంగ్రహించుట, అపహరించుట, తినుట మొదలయిన అనేకార్థాల్లో ఈ లాగించు ఈనాడు వ్యవహారంలో ఉంది. దీనికి ఈ అర్థాలు ఆధునికాలు. రాయలనాటికి దీనికి అపహరించు అనే అర్థం ఉన్నదా అనేది మరో ధర్మసందేహం.

"లింగధారణత్ కుత్తుకలందుఁ గొందఱకుఁ గూర్పఁగ"—(8-816) అనే ప్రయోగం కూడా పరిశీలనార్హం. ఇది అరవ తెలుగునుడికారంలాగా ఉంది. "ఈ దండ మీగొంతులో వేసుకోండి" అంటారుట వాళ్ళు. బహుశః ఈ ప్రయోగాలు శిథిల పూరణం చేసినవారి చేతిచలవయినా కావచ్చు.

నిడదవోలు వారు తమపీఠికలో ద్వితీయముద్రణం చేయించిన శ్రీముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారిని ప్రశంసిస్తూ తత్ప్రాసతో ఒక చంపక షట్పది రాశారు. అందులో '—మల్లికార్జున, కృతమయి కంద పద్య గతి—'' అనేచోట 'కృ' వల్ల పూర్వపాదంతంలో 'న' గురువు కావలసివస్తోంది. ఇది చెల్లదు

ఉద్భటారాధ్య చరిత్రకు సంబంధించి ఇవి నా ధర్మసందేహాలు. తాళపత్ర ప్రతులను చూసిన వారెవ రయినా వీటిని తీర్చడం అవసరం. లేదా తాళపత్ర ప్రతులు ఉంటే వాటిని అందించినా చాలు. ఆంధ్ర భారతికి గొప్ప ఉపకారం చేసినవారు అవుతారు. తొలి ముద్రణపీఠికలో వేటూరివారు 'ముదిగొండవారని యిప్పుడాంధ్రదేశమునఁ బ్రఖ్యాతులుగానున్న యారాధ్య బ్రాహ్మణులకు ఈ యుద్భటారాధ్యుడు మూలపురుష దని యీ ప్రబంధమందు గలదు. ఆ యుద్భటుని దగ్గరనుండి ముదిగొండవారి వంశక్రమము గూడ కొంత గ్రంధాంతమున గానవచ్చుచున్నది. ఈ వంశ క్రమము పాల్కురికి సోమనాధుని గ్రంధమునఁ గాన రాదు.' అనిమాత్రము చెప్పి ఊరుకొన్నారు. బహుశ వీరికి కూడా అనాడే ఇటువంటి ధర్మసందేహాలు కలిగి ఉండాలి. లేకపోతే అంటీముట్టనట్టు ఇలా రెండు ముక్కలు రాసి ఊరుకొనే మనీషికాదుగదా వీరు !

తెలుగు విభాగం,
నాగార్జున యూనివర్సిటీ
నాగార్జున నగర్–522 510

## ఫ్రాస్ట్

జి.సోమశేషు

నీ కవితలో
నేలతల్లి పులకరిస్తుంది:
పైరులు తలలూపుతాయి
సెలయేరులు జలజలా పారుతాయి;
నవకవితకు నాంది నీ గళం (కలం)
పాతపద్ధతులకు లొంగకుండా
నీ బాటను నీవే ఏర్పరచుకొని
అమెరికా ఔన్నత్యాన్ని
నలుదిశలా చాటిన
మహామనీషివి నీవు;
ఒక చేతిలో హలం
వేరొక చేతిలో కలం;
శ్రమను ఆనందమయం చేసింది నీ కవిత
శ్రమ నినాదం వేదంలా
ధ్వనిస్తుంది నీ నాదంలో
జీవభాషలో నీతికి, రసానుభూతికి
సమన్వయం చేకూర్చింది నీ కవిత:
నిరాడంబరతలో
సామాన్యతలో
దాగిన గంభీర వేదాంతాన్ని
ప్రబోధిస్తుంది నీ కవిత:
ఛందస్సు మైనంలా కరిగి
నీ పలుకులను హత్తుకొంటుంది
జనభాష ఉషోదయంలా
నీ కవితాకాంతకు
సహజాలంకారమై
సంశోభించింది;
అందుకే అమెరికా
మొట్టమొదటి ప్రజాకవి నీవు
అమెరికా జాతీయరవి నీవు.

1-6-519, (న్యూటౌన్)
మహబూబునగర్

# తెల్లకాగితం

సుధామ

లోకమంతా పచ్చగా వున్నప్పుడు
వెచ్చని అగ్ని స్పర్శలో
మౌనంగా ఊర్ధ్వలోకాలకు మృత్యుసంతువు
పిలిచినపుడు
భార్యాపిల్లలూ అనే లౌకిక పాశ పరిష్వంగాలను
నిరామయంగా త్రెంచుకుని వెళ్ళిపోవడం
శబ్దారామాల నుండి
నిశ్శబ్ద శాంతివెన్నెల పీఠానికి, స్వధామానికి
చేరుకోవడం
నిజమే !
మమ్మల్ని ఈ లోకానికి తెచ్చిన మా జన్మ-
పురుషులైన మీకు
కాలచక్రంలో సహజ పరిభ్రమణంగానే
స్ఫురించవచ్చు.
నిజమే ప్రతి తండ్రీ ఓనాడు తండ్రినే
చేరుకుంటాడు
వర్తమానాలు గతం సమాధిగ్రస్తం కాకమానవు
ఈ క్షణం మరుక్షణం గతక్షణమై
మనుగడలో
ఊపిరి ఊడల నాడులు
అనవరతం ఊడిగిపోతూనే వుంటాయి.
కానీ బతుకునిండా ఆశలను స్ప్రే చేసుకుని
జీర్ణగేహాలను సైతం
వైభవ దేవాలయాలుగా అర్చించుకోవడం
నేను, నాది అనే లంపటాలను బంధించుకుని
యాంత్రికతకు మనుగడను అర్పించుకోవడం
అంతా చేసే ఘనే.

* నిశ్శబ్దంగా పుట్టకపోయినా
మృత్యువు నిశ్శబ్దంగానే కనురెప్పలపై
ఏదో పారలౌకికపు హారవేస్తుంది
ఇంక ఈ లోకాన్ని చూడలేని కళ్ళు
ఆత్మనేత్రాలు విప్పుకుని
ఏ మార్గంలో విహరిస్తాయో, ఎట చేరుతాయో
ఆ సాధకుడయినా ఊహించగలడో లేదో తెలీదు.

* నాకు తెలుసు—
ఒకరోజు మృత్యువు జన్మిస్తుందని.
జన్మ మరణిస్తుందని
"చావుపుట్టుకల మధ్య సందేహంలాంటి జీవితం"
అమృతం కురిసిన రాత్రులకు
దైనందిన అంగారవల్లరులకు
సమానంగానే సుబోధకం కాగలిగితే
కావలసిందేముంది!
కాని జన్మ హేతువా?
ఎవరికి తెలుసు?
వర్తమాన అవస్థావ్యవస్థాపరిక్షింపులో
పోయిన వారే బతికి నట్లనీ
బతికున్న మనం పోతున్నట్లనీ ఎవరికితెలుసు ?

* సహజంగా జన్మించవలసిన మృత్యువును
అనుక్షణ ప్రమాద భయాల్లోనో,
విషవాయువుల్లోనో, ప్రయాణసాధనాల్లోనో
పరీక్షనాళికల్లో
ప్రాణవత్ శిశుమూర్తులను రూపొందించినట్లు
అణువులతో, పరమాణువులతో-మృత్యువును—

ఆయుధాలతో, కాలుష్యాలతో రూపొందించడం
ఎంత విషాదం !

* ఈ శోకం మృత్యువును సైతం
సహజంగా, చల్లగా రానీయకపోతే
అంగారక గ్రహాలకు రాకెట్లలో వెళ్ళి
ఏ ప్యాకెట్లలోని రవ్వంత విషంతోనో,
కుదరని పచ్చని ఏ రోగాలతోనో
మృత్యువును పుట్టించగల స్థాయిలోనే వుంటే
ఏం సాధించినట్లు మనిషి!
ఎక్కడ పోయినట్లు నిశి?

* అనుభవాల ఊతలిచ్చిన తాత,
అందమైన కథగా జీవితం చెప్పిన అమ్మమ్మ,
అనుక్షణం తన ఎదరేకుల మధ్య
తనయుడు తంతున్నా రక్షించి పెంచిన తండ్రీ,
వ్యక్తిని వ్యక్తిగా తీర్చిదిద్దేందుకు సహకరించిన
ఎందరో
ఒకొక్కరే శాశ్వతంగా నిష్క్రమిస్తూంటే
కళలుగానీ, సైన్సుగానీ, చివరకు ఆధ్యాత్మికం
గానీ
ఏం చేస్తాయి.

* ఎవరి ప్రయాణాలు వారివే
బ్రతుకురైలు ఒక్కటే వివిధ మజిలీలు చేస్తుంది.
మజిలీలు తప్ప గమ్యం అంతుపట్టని
అనంత యాత్రకు ఆరంభం పుట్టుక.
పోయినవారు పుట్టిన పరమార్థాన్ని సాధించేశారని-
అనుకోవడం తృప్తి.

ఎందుకంటే బ్రతుకుతున్న మనం
ఏ పరమార్థాలు సాధిస్తున్నామని
ఉడుపులకిందా, ఇంటి రూపులకిందా
కంచంలో వేళ్ళతో, మంచంలో కాళ్ళతో
సాగుతున్నా.

* నిన్ను నీ కాళ్ళమీద నిలబెట్టిందెవరో
నిన్ను అంతంవరకూ ఆరంభంగా బ్రతకమని
ప్రేమ భిక్ష పెట్టిందెవరో కూడా నువ్వు
విస్మరిస్తావు
ఊపిరున్నంత కాలం
జీవితం నిండా కోరికలను స్మరిస్తావు
తీరని కన్నీటి ధారికలను గర్జిస్తావు
ఉప్పొంగుతావ్, గెంతుతావ్, ఉబుకుతావ్
గుడ్డును కోడి చేయగలవే కానీ
కోడిని గుడ్డుగా మార్చలేవని తెలిసీ పయనిస్తావు
మృత్యువును జయించలేకపోయినా
ఆ ఊహను జయిందాలని తపిస్తావు
అహంకరిస్తావు
సాటివారితో కలహిస్తావ్, కలబడతావ్
ద్వేషిస్తావ్, ప్రేమిస్తావ్
చివరకు ఓ క్షణం
చెప్పాపెట్టకుండా, నీకే తెలీకుండా నిష్క్రమిస్తావ్

* మనిషీ ఇది జీవితం
ఏ అక్షరాలు రాసి అక్షరమై నిలుస్తావో నీకే
వదలిన తెల్ల కాగిత

8-2-1/7/5,
ఎస్.బి.ఐ. ఎదుట,
ప్రతాప్‌నగర్,
పంజగుట్ట కాలనీ,
హైదరాబాదు-482.

# అస్తిత్వవాద ఛాయలలో 'పాంచభౌతికం'

— వి.డి.యల్. ప్రసన్న

ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో 11-9-85 నుండి 18-11-85 వరకు ధారావాహికంగా ప్రచురింపబడిన నవల— పాంచభౌతికం. రచయిత్రి 'లాలిత్య' (డా. సి సీత)

జీవితం అంటే ఏమిటి? ఏ శక్తి ఈ జీవితాన్ని నడుపుతున్నది? జనన మరణాల మధ్య గడిపే కొద్ది పాటి కాలానికి సార్థకత, నిరర్థకత ఎలా కలుగుతాయి? సార్థక నిరర్థకాలకు ప్రమాణం ఏమిటి? మొదలైన ఎన్నో ప్రశ్నలకు ఎందరో తత్వవేత్తలు, సాహిత్యకారులు సమాధానాలను అన్వేషించారు. అయినా ఈ అన్వేషణ ఆగలేదు, ఆగదు కూడాను. నిరంతరం కొనసాగే ఈ అన్వేషణలో తమకు లభించిన సమాధానాలను లోకానికి చాటి చెప్పారు అన్వేషకులు. వారిలో సాహిత్యకారులు కూడ ఉన్నారు. వారి లక్ష్యం పాఠకులకు జీవితాన్ని దర్శించటంలో చేయూత నివ్వటం. జీవితం పట్ల పాఠకులకు ఒక విశిష్ట దృక్పథాన్ని కలుగచేయటం ఉత్తమ సాహిత్య లక్షణంగా పేర్కొనబడింది. అలాంటి రచన చేయాలంటే రచయిత/త్రికి జీవితం పట్ల నిశిత అవగాహన, మౌలికమైన అభిప్రాయాలు ఉండాలి. ఈ అభిప్రాయాలు తన అనుభవంద్వారా గడించినవైనా కావచ్చు లేదా ఏదైనా ఒక తాత్విక చింతన ఆలంబనగా లభించినవైనా కావచ్చు. 'పాంచభౌతికం'లో జీవితం పట్ల అనేక జీవిత సత్యాల పట్ల లాలిత్య గారు వ్యక్తపరచిన అభిప్రాయాలకు అస్తిత్వవాదమనే ఒక విశిష్ట దార్శనిక దృష్టికి సారూప్యం కనిపిస్తుంది. నవలను సంపూర్ణంగా అర్థం చేసుకోవాలంటే ఆ సారూప్యం గ్రహించాలి. దానికి 'అస్తిత్వవాదం' గురించి సంక్షిప్త పరిచయం అవసరం.

పశ్చిమ దేశాలలో ప్రారంభమై విస్తరించిన తత్వచింతన అస్తిత్వవాదం. ప్రారంభమవటం రెండవ ప్రపంచ యుద్ధానికి చాలముందే అయినా ప్రాచుర్యాన్ని పొందింది యుద్ధానంతరమే. ప్రపంచ యుద్ధం మానవుని పైశాచిక ప్రవృత్తికి పరాకాష్ఠ. విచక్షణా రహితంగా జరిగిన ఆ నరమేధానికి ప్రత్యక్ష సాక్షులైన వారిలో మానవత్వంపై నమ్మకం కూకటివేళ్లతో పెకిలించి వేయబడింది. ఆదర్శాలు, విలువలు అర్థహీనమైన పదజాలంగా మిగిలిపోయాయి. అనుక్షణం వెన్నాడే మృత్యువును గుర్తించిన మానవుడు గతం పట్ల అలక్ష్యం, భవిష్యత్తు పట్ల అవిశ్వాసం పెంచుకున్నాడు. వర్తమానమే అతనికి అర్థవంతమైనదిగా కనిపించింది. మనిషి క్షణాల్లో జీవించటం మొదలుపెట్టాడు. అశాంత చిత్తుడైన ఆనాటి మానవునికి నైతిక ఆధారం ఏదీ దొరకలేదు. తర్కంతో దేనినైనా పరిష్కరించవచ్చనే బుద్ధివాదం ఘోరంగా విఫలమయ్యింది. మూఢవిశ్వాసాలతో కట్టిపడేసే మతధర్మం పట్ల విముఖుడైన మానవునికి సాంత్వన చేకూర్చింది. అస్తిత్వవాద తత్వచింతన డెన్మార్క్‌కు చెందిన కిర్క్‌గార్డ్‌తో ప్రారంభమై జాస్పర్స్, కాఫ్కా, కాము, సార్త్ర్ వంటి ఎందరో ప్రముఖుల రచనలలో వికసించింది. వీరిలో కొందరు ఆస్తికులు, సార్త్ర్‌వంటి వారు నాస్తికులు. అస్తిత్వవాదం భిన్నత్వంలో ఏక

త్వం కలిగిన తత్వచింతన ఇది ఎక్కువగా సాహిత్యం ద్వారా ప్రజలకు దగ్గరయింది. ఆ సాహిత్యంలో ఒకవైపు సామాన్య మానవుని అశాంతి, నిరాశ, నిస్పృహ, అవిశ్వాసం, మృత్యు చింతన చోటు చేసుకుంటే, వేరొకవైపు వీటినుండి బయట పడటానికి అవసరమైన ఆత్మవిశ్వాసం, స్వయం నిర్మాణశక్తి, స్వాభిమానం దృఢసంకల్పశక్తులకు ప్రాధాన్యతనిస్తూ రచనలు చేయబడ్డాయి. వీటిలో రెండవ కోవకి చెందిన సాహిత్యంలో వ్యక్తి అస్తిత్వానికి (ఉనికికి) ఆధారము, ఋజువు అయిన అనుభూతికి ఇవ్వబడిన స్థానం అనుపమానం. ఆ విలువలతో పాంచభౌతికం నవలకు సంబంధం ఉంది కనుక అవేమిటో తెలుసుకుందాం—

1. తర్కాతీతమైన అనుభూతి మానవుని ఉనికికి ఆధారం. తీవ్రమైన ఒక్క అనుభూతైనా వ్యక్తి జీవిత గమనాన్నే మార్చివేయగలదు. అనుభూతిని గుర్తించటం తనను తాను తెలుసుకోవడమే.

2. జీవిత విలువలు వైయక్తికమైనవి. సామాజిక విలువలను వ్యక్తి తన స్థితివిశేషాలను బట్టి అంగీకరించటం తిరస్కరించటం చేస్తాడు.

3. వ్యక్తి స్వేచ్ఛాజీవి, స్వాతంత్ర్యం అతనిఊపిరి.

4. స్వేచ్ఛగా స్వతంత్రంగా తీసుకున్న తన నిర్ణయాల ఫలితం ఎంత కఠినమైనా స్వీకరించటమే నైతికత, నిజాయితీ.

5. స్వేచ్ఛను అభిలషించేవారు క్రియాశీలురై ఉండాలి.

6. వ్యక్తి తన జీవితానికి తానే కర్త.

7. జీవితంపట్ల అనురక్తి, అంతరంగంపట్ల అగాధ విశ్వాసం వివేకముకలిగిక్రుతపః:కల్పుడైన వ్యక్తి మానవతాజ్యోతిని వెలిగిస్తాడు.

8. తనను తాను తెలుసుకొనేందుకు వ్యక్తి చేసే ప్రయత్నమే జీవితం.

స్వతంత్రంగా తన జీవితగతిని నిర్ధారించుకుంటూ తన పనులకు పూర్తి బాధ్యతవహిస్తూ గడిపే వ్యక్తి యొక్క స్థితిని అర్థంచేసుకోటానికి చేసే ప్రయత్నమే అస్తిత్వవాదం. స్థూలంగా 'లాలిత్య'గారి అలాంటి యత్నమే 'పాంచభౌతికం' సహేతుకమైన వివేచన ద్వారా దీనిని విశదపరచవచ్చు. ముందుగా పాత్రల జీవనగతిని పరిశీలిద్దాం.

చేతన, సౌమిత్రి భార్యాభర్తలు. సుధ, మధు వారి పిల్లలు. చేతనకు ఒక ఇల్లు, ద్రాక్షతోటలు తండ్రి ద్వారా సంక్రమించాయి వాటిని ఆమే స్వయంగా నిర్వహిస్తూ వృద్ధి చేస్తుంది. సౌమిత్రి ఒక ఫ్యాక్టరీ యజమాని. ఆర్థికంగా ఉన్నతవర్గానికి చెందినవారైనా ఇద్దరూ వ్యక్తులను ఆర్థికస్థాయిని బట్టిగాక ఆత్మగౌరవం, స్వాభిమానం ఆధారంగా గుర్తిస్తారు. ఇరువురిలోను పరస్పర అవగాహన, గౌరవాభిమానాలు మెండు. చేతన సౌందర్య పిపాసి. భావుకురాలు. నింగినేలను తాకేచోట తననుతానుచూసుకోవాలని ఆమె ఆకాంక్ష. ప్రకృతిలో తాదాత్మ్యత పొందాలనే తృష్ణ ఆమెనునడిపించేజీవశక్తి. ఆమెలోని ఈ తృష్ణను గుర్తిస్తాడుఆరోహ్. ఆమెలోప్రకృతిని దర్శిస్తాడు. ఆప్రకృతి సౌందర్యాన్ని సజీవంగా తన కళలో ప్రతిఫలింపచేస్తాడు. చేతన అంతరంగాన్ని గ్రహించి చేరువైన పురుషుడు ఆరోహ్. అతను తన చిత్రాలను కళాభవన్‌లో ప్రదర్శించటం సహించలేకపోతుంది చేతన అతని కళకు ప్రేరణ అవటం తనకు ఇష్టం లేదని దూరమవుతుంది. ఆరోహ్‌కు దూరమైన చేతన తన పొరపాటు తెలుసుకుని ఛిన్నమనస్కురాలవుతుంది. ఇలా సంవత్సరాలు గడిచిపోతాయి. తమ దాంపత్యంలో పెరుగుతున్న అగాథాన్ని గుర్తించి వ్యథ చెందుతాడు సౌమిత్రి. అతని ఫ్యాక్టరీలోనే పని చేసే

'గీత' అనే అమ్మాయివల్ల కొంత సాంత్వన పొందు తాడు.

తల్లిదండ్రుల లోని స్వాభిమానం, ఆత్మగౌరవం పుణికి పుచ్చుకున్నది సుధ. అందుకువ్యతిరేకం మధు. స్వయంకృషితో జీవితాన్ని నిర్మించుకునే వ్యక్తి సమీర్. ఈతనిని అందరూ అభిమానిస్తారు. ఆరోహ్ చేతనల కలయికకు పరోక్షంగా కారకుడయితే సుధకు జీవితాన్ని అర్థం చేసుకోవటానికిసహాయకుడవుతాడు. చేతనలోని సంఘర్షణ ముగిసి ఆమె ఆరోహ్‌కు చేరు వవటం తన స్థానాన్ని గీతకు అప్పచెప్పటం, పాంచ భౌతికమైన శరీరం ద్వారా తాను తెలుసుకున్న సత్యాన్ని స్పష్టం చేయటంతో నవల ముగుస్తుంది.

ఈ నవల ఇతివృత్తం అనుభూతుల చుట్టూ అల్లబడింది. చేతన అనుభూతులే ఆమె జీవనగతిని నిర్ధారిస్తాయి ఆమె జీవితానికి అదే ఆధారం. అనుభూతిని నిర్వచించడం అసంభవం. తర్కం ద్వారా విశ్లేషించటం కానీ, అనుభూతి ఎందుకు కలుగుతుంది అనే కారణాలు అన్వేషించటం కానీ అనుభూతిని తెలుసుకోటానికి మార్గాలు కావు. అనుభవగతమైనప్పుడు మాత్రమే అనుభూతిని తెలుసుకోగలం. సమయాసమయాలు వయోభేధాలు అంతస్థుల తారతమ్యాలు ఏవీ అనుభూతులను ప్రభావితం చేయివు. కానీ వ్యక్తి ఉనికికివిశిష్టతను ఆపాదించేవి అనుభూతులే. చిన్నప్పటి నుంచీ చేతనలో ప్రకృతి ప్రేమ ఎక్కువ. ఆకాశం, ఇంద్రధనుస్సు, నిప్పు, జలపాతాలు, నల్లనిమట్టి ఆమెకెంతో ప్రీతికరమైనవి. సూర్యోదయం, సూర్యాస్తమయ సమయాలను వీక్షిస్తూ తన ఉనికిని మర్చిపోతుంది ఆమె. సంధ్యాసమయంలో ఆకాశం భూమిని స్పర్శిస్తోందేమోనన్నట్లుండే సుందర దృశ్యం ఆమెఅంతరంగాన్ని కవ్విస్తుంది. ఆ సమయంలో ఆకాశంలో పొంగే రంగుల్లో ప్రభవించేపౌరుషం తనని పిలుస్తుంచే దిగంతాలు కలిసేచోట తనను తాను చూసుకోవాలని ఆమె అనుభూతి ఆరోహ్‌ను చూసినప్పుడు సాక్షాత్కరిస్తుంది. ఆతని సమక్షంలో తనసహజత్వాన్ని పొందుతుంది: తానేమిటో తెలుసుకోగలుగుతుంది. ఆమె ఉనికి ఆ అనుభూతిలోనే అని స్పష్టం అవుతుంది. అప్పటికి ఆమె మధ్యవయస్కురాలు, వివాహిత అయినా ఇవేవి ఆమె అనుభూతిని పొందటానికి ప్రతిబంధకాలు కావు. అంటే అనుభూతి అంతరంగానికి సంబంధించినది, నిత్యనూతన రసస్ఫూర్తిదాని సొత్తు. ఆలాగే ఆరోహ్ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ ఆ సౌందర్యాన్నంతా తన స్వంతం చేసుకోవాలన్న ఆర్తి కలవాడు. చేతనలో అతనికి ప్రకృతి సజీవంగా సాక్షాత్కరిస్తుంది. అంతేకాదు అతని చూపులు ఆమె గుండెలలో సృష్టి నిబద్ధమైన నిగూఢ సంగీతాన్ని విని పిస్తాయి. ఆమె ఎవరు, వివాహితా, అవివాహితా అనే ప్రశ్నలకు తావే లేదు. వారిద్దరూ దగ్గరవటానికి కారణం ప్రకృతిలో కరిగిపోవాలనీ, అ ప్రకృతిపై అధిపత్యం పొందాలనీ, వారి తృష్ణ. పరస్పరానుభూతులను గ్రహించగలిగినవారు మాత్రమే ఒకరికొకరు మానసికంగా దగ్గిరవుతారు. చేతన, ఆరోహ్‌ల ఉనికికి అలంబన ప్రకృతిపరమైన వారి అనుభూతులు. సౌమిత్రి చేతన అనుభూతులు గ్రహించలేడు. అందుకే అతడు ఆమె అంతరంగాన్ని చేరలేకపోతాడు. తాను చేతనను గుర్తించలేకపోయానని సౌమిత్రి ఎరుగడు. ఆందుకే ఆమె దూరమైందని వ్యథ చెందుతాడు. ఆ వ్యథలో తన ఉనికికి ఆధారం అయిన రసవంతమైన భావం తనకి కొరవడిందని అనుభూతమవుతుంది. ఆ అనుభూతి అతని జీవితగతిని మారుస్తుంది. అనుభూతిపై ఎవరి వశమూ ఉండదనటానికి ఇంకొక చక్కని ఉదాహరణ గీత. సౌమిత్రి పట్ల ఆమె ప్రేమ ఎటువంటి ఫలాన్నీ ఆశించనిది. వేరొకరిపై పుట్ప్రేమను మళ్లించటం ఆమె వశంలోకూడ లేనిది. వివాహితుడని భార్యానురక్తుడని తెలిసి కూడా ఆమె మనసు అతని భావనతో స్పందిస్తుంది. దానిని అంగీకరించే ఆమె ఆనందాన్ని పొందుతుంది.

అనుభూతుల పట్ల సహజ స్వీకారభావం కలిగి ఉండాలి వ్యక్తి. అలాకాక అనుభూతిని అణిచివేయటం మృత్యువుతో సమానం. ఆరోహ్‌కు దూరమయి చేతన తన సహజ ప్రకృతికి దూరమవుతుంది. కానీ ఆరోహ్ అలా కాదు. చేతన దూరమైన తర్వాత చెల్లాచెదురైన అతని అనుభూతులు తబలా వాదనలో వినూత్న స్వర సమ్మేళనాలను సృష్టిస్తాయి అన్ని వేళలా అనుభూతులను స్వేచ్ఛగా వ్యక్తీకరిస్తూ ఆ అనుభూతులలోనే ఊపిరి పీల్చే కళాస్రష్ట అతను.

అనుభూతుల భిన్నత్వాన్ని సమీర్ ద్వారా స్పష్టం చేస్తారు రచయిత్రి. చేతనలో ఆరోహ్‌కు 'ప్రకృతి కన్య' సాక్షాత్కరిస్తే అతను ఆమెను, తనలో కలిగిన అనుభూతులను రంగుల్లో రూపుదిద్దుతాడు. అమూల్యమైన కళాసంపద ఆవిర్భవిస్తుంది. అలాగే సమీర్‌లోని కళాకారునికి ప్రకృతిలోని జీవశక్తి చేతనలో సాక్షాత్కరిస్తుంది. కానీ అతను ఆమెలో 'ప్రకృతి మాతను' దర్శిస్తాడు. ప్రకృతి రహస్యాలను బోధపరిచే తల్లిగా ఆమెను అతను చిత్రిస్తాడు. చేతన కతను మానసపుత్రుడే అవుతాడు. సమీర్‌లో ఆరోహ్ తన బాల్యాన్ని చూసుకుంటాడు.

జీవనగతి నిర్దేశంలో అనుభూతికికల ప్రాముఖ్యాన్ని దాదాపు అన్ని పాత్రలద్వారా వ్యక్తంచేసిన రచయిత్రి, సమీర్ మాటలలో ఇంకాస్పష్టం చేసారు.-''

ది ఎబిలిటి టు ఫీల్ ఈజ్ వండర్‌ఫుల్....ఫీల్., అంటే...అనుభూతి ...అనుభూతి....అనేది పొందగలగడం...ఎంత అద్భుతం..అదే ప్రాణానికి..నిర్వచనం ....ప్రాణముండటానికి మనిషికి ఋజువుచేసే ప్రమాణం.''

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు వ్యక్తి ఉనికి ఆధారమైన అనుభూతి వ్యక్తీకరణకు ఎంతో అవసరం. స్వేచ్ఛ ఒకరిచ్చేది కాదు. ఎవరికి వారు ఆర్జించుకునేది. స్వేచ్ఛను గుర్తించి గౌరవించేవారు ఎవరికీ భయపడరు. లోకభీతికి, లోకనిందకు అతీతంగా ఉంటారు. అయితే స్వయంగా ఆర్జించిన వారు మాత్రమే దానిని సరిగా అర్థంచేసుకోగలరు; ఉపయోగించగలరు.చేతనలోను సౌమిత్రిలోను స్వేచ్ఛాప్రియత మెండు. అందుకే ఒకరిదారికి ఒకరు అడ్డుతగలరు. చేతన వేరొకవ్యక్తి పట్ల ఆకర్షితురాలైందని తెలిసుకున్న సౌమిత్రి ఆమెను ఏమీ ప్రశ్నించడు. ఆవేశంలో ఒకే సారి ప్రశ్నించినా చెప్పదలుచుకున్న దానికంటే ఎక్కువ ఆమె చెప్పదు. అతను తిరిగి అటువంటి ప్రయత్నమూ చేయడు. చేతన ప్రవర్తన తప్పా ? అని అతని అంతరంగం తర్కిస్తే తేలింది—తప్పొప్పుల ప్రశ్నేలేదని; స్వేచ్ఛతో కూడిన పరస్పర ప్రేమే ఉదాత్త ప్రణయం అని. అందుకే మూడుముళ్ల బంధంతో ఆమెను కట్టివేయాలని ప్రయత్నించడు. చేతన పట్ల ప్రేమ వ్యక్తీకరణకు స్వేచ్ఛ కరువైనపుడు అది అతని గుండెవ్యథకే కారణమయింది. పిల్లల పెంపకంలోకూడా స్వేచ్ఛకు అతనిచ్చే విలువ స్పష్టం అవుతుంది. ఇక చేతన ఎవరి విషయాలలోను జోక్యం పెట్టుకోదు. తన విషయంలో ఎవరినీ కలుగ చేసికోనివ్వదు తన మమతాపాశంతో ఎవరినీ కట్టివేయదు. అందుకే సుధ హాస్టల్లో ఉంటానన్నప్పుడు అంగీకరిస్తుంది. గెస్ట్‌హౌస్‌లో గీతను సౌమిత్రినిచూసిన తర్వాత మౌనంగా వెనుతిరిగి వచ్చేస్తుంది కానీ అదేమని ప్రశ్నించదు. ఎటువంటి స్థితిలోనైనా తన మనసులోని మాట నిర్మొగమాటంగా చెప్పగలదు ఆమె. ఇక ఆరోహ్ స్వేచ్ఛాయుత వాతావరణంలో పెరిగి పెద్దవాడయి ఎటువంటి అనుభూతినైనా భావాన్నైనా అణచివేయడు, అతని స్వచ్ఛంద ప్రకృతే అతనిలోని కళాకారునికి జీవం. అందుకే చేతనతో తన అనుబంధానికి ఎటువంటి పూర్వాపరాల ఆలోచన చేయడు, అవసరమున్నదని కూడా భావించడు,

"ఫ్రీడమ్ ఈజ్ సమ్‌థింగ్ దట్ మస్ట్ బి గెన్యుయిన్" అనే అభిప్రాయం గల సుధ ఎటువంటి వారి సమక్షంలోనైనా స్వేచ్ఛగా తను నమ్మినదానిని వెల్లడించగలదు. అందుకే స్టూడెంట్ యూనియన్ ప్రెసిడెంట్ పదవికి సెలెక్ట్ అయినందుకు ఫంక్షన్ ఏర్పాటు చేయబడినప్పుడు సభికులలోని పెద్దలను ఎవరినీ ఉద్దేశించకుండానే "ఐ డోన్ట్ రికగ్నైజ్ ఎనీ యూనియన్ ఆఫ్ ఇండివిడ్యువల్స్....... నేను గుర్తించేది వ్యక్తి ఉనికిని, ఆ ఉనికిని అర్థవంతం చేసుకోగల మానవ మేధను, అంతే, మోరోవర్, నన్ను ఎవరైనా నడిపించటంలో కాని, నేనెవరినైనా నడిపించటంలో గానీ నాకు విశ్వాసం లేదు." అని స్పష్టం చేస్తుంది. తను స్వేచ్ఛగా జీవించటమే కాక ఎదుటివారి స్వేచ్ఛను ఆమె గౌరవించే తీరు ఎన్నతగింది. చేతన ఆరోహేల నెరిగిన గోపాల్ అనే వ్యక్తి డబ్బు కోసం మధును బ్లాక్‌మెయిల్ చేస్తాడు. మధు తల్లితో ముభావంగా ఉంటూ సుధను కూడ అలాగే వుండమంటాడు. అది విన్న సుధ ఏమాత్రం చలించకుండా మధును గోపాల్ వద్దకు తీసుకు వెళ్ళి గోపాల్‌తో చెబుతుంది —

"మా మమ్మీ మరొకరితో ఎటువంటి సంబంధం కలిగి ఉన్నా మాకు అభ్యంతరం లేదు".......తమకు స్వేచ్ఛలేని మనుష్యులు మరొకరు దానిని అనుభవించటం చూడలేరేమో.... మా మమ్మీని నీవు కాదుకదా లోకం అంతా గీ పెట్టినా.... అవమానించినా మేము కించపడం. ఆమె బాగోగులు ఆమెకు తెలుసు. ఆమె గౌరవం ఆమెకు తెలుసు. అలాంటి తెలిసిన మనిషి ఏం చేసినా అది ఎంత కఠోరమైనా మేం స్వీకరిస్తాం" సుధ ఈ విషయాలను తల్లితో ఎప్పుడూ ప్రస్తావించదు. ఆ అవసరం ఆమెకు తోచదు. స్వేచ్ఛకు మారుపేరు సమీర్, అయితే ఎప్పటికీ దానిని అర్థం చేసుకోలేదు మధు. ఎప్పుడూ ఎదుటివారి దృష్టిని బట్టి విమర్శలను బట్టి తన జీవితాన్ని మార్చుకునే అతను స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తాడు.

స్వేచ్ఛ ఎలా లభిస్తుంది? ఎవరి జీవితం వారు మలుచుకోగలిగినప్పుడు మాత్రమే స్వతంత్రంగా వ్యవహరించ గలుగుతారు. తాము చేసే పని మీద నమ్మకం, గౌరవం కలిగినవాళ్ళు మాత్రమే తమవైన నిర్ణయాలను అమలుపరచి ఫలితాలను ధైర్యంగా ఎదుర్కొగలుగుతారు. విమర్శలకు తల ఒగ్గరు వారు. పోతే ఈ విధమైన స్వాతంత్ర్యాన్ని పొందటానికి వ్యక్తి క్రియాశీలుడై వుండాలి. కాలం విలువ తెలుసుకుని, తన మేధ నుపయోగించి కాలాన్ని తన వశంలో వుంచుకోవాలి. కష్టపడటంలోని ఆనందం తెలిసిన వ్యక్తి మాత్రమే అలా చేయగలుగుతాడు. సౌమిత్రి, సమీర్, సుధలు అలాటివారే. కూలివాని కొడుకుగా జీవితం ప్రారంభించిన సౌమిత్రి శ్రమ విలువ తెలుసుకోబట్టే ఫ్యాక్టరీ యజమాని కాగలిగాడు. తన కొడుకు మధు ఆ విలువను తెలుసుకోకపోవటం కనిపెట్టి అతనిని ఫ్యాక్టరీలో సాధారణ కూలీగా పని చేయమని ఆదేశిస్తాడు. సమీర్ అనాథాశ్రమంలో కళ్ళు తెరిచిన బాలుడు అయినా అతని కెన్నడూ ఆ భావన రాదు. తను నిలబడటం కోసం వేరొకరి ఆధారం వెతికేవారికి కానీ తనకై తాను నిలబడి నడవటం నేర్చుకున్న వారికి ఆ భావన రానేరాదు. సుధ చిన్న వయసులోనే పేదరికం అంటే ఏమిటో తెలుసుకోగలుగుతుంది. సమీర్ జీవితాన్ని చూచిన ఆమె పేదరికం అంటే డబ్బు లేకపోవటం కాదని, అలసత్వం, సోమరితనం కష్టపడకుండా అన్నీ కావాలనుకోవటం అనే అభిప్రాయానికి వస్తుంది. ఆమె అభిప్రాయాన్ని ఋజువు చేస్తూ మధు తల్లితండ్రి తనకిచ్చిన డబ్బంతా దుర్వినియోగపరిచి ఇంజనీరింగ్‌లో చేరటానికి సుధను డబ్బు అడుగుతాడు. తమ్ముడి స్వభావాన్ని చదివిన ఆమె కష్టపడి ఒక రూపాయి సంపాదించగలిగిననాడు మాత్రమే తాను అతనిని తమ్ముడిగా చూడగలనని చెప్పి పంపివేస్తుంది. ఇక్కడ డబ్బుకంటే క్రియాశీలతకి ఆమె ఎక్కువ ప్రాధాన్యత నిచ్చింది. సుధ

మధు ఒకే రకంగా పెరిగిన వాళ్ళైనా వారి జీవితాలు వేరువేరు దిశలలో నడవటానికి కారణం క్రియాశీలతే కష్టపడి చదివి సంపాదించిన స్కాలర్‌షిప్‌తో సైకిల్ కొనుక్కుంటుంది. కారు కొనుక్కోమన్న తల్లితో అంత తాహతు తనకు లేదంటుంది. తోటి విద్యార్థిను లకు అర్థం కానివి బోధపరుస్తూ, దానికై తాను వసూలు చేసిన ధనంతో, వివిధ పత్రికలకు వ్యాసాలు వ్రాయటం వల్ల వచ్చిన డబ్బుతో కాలేజీ చదువు కొన సాగిస్తుంది. ఈవిధంగా తాను నిర్మించుకునే జీవితంపై ఎవరికీ అధికారం ఇవ్వదు. స్వార్జితమైన జీవితాలపై వేరొకరి అధికారం సాగదు. వారిని ప్రేమించిన వారికి గానీ వారిచే ప్రేమించబడినవారికి గాని ఆ అధికారం వుండదు. అందుకే సుధ గురించి ఫిర్యాదు చేసిన మధుకు సుధను సైకిల్‌పై వెళ్ళొద్దని చెప్పటానికి తన కెంతమాత్రం అధికారం లేదని సమాధానం చెప్తాడు సౌమిత్రి.

అపారమైన జిజీవిష కలిగినవారు సౌమిత్రి ఆరోహిలు. చేతన వల్ల వారిద్దరు వ్యథకు గురి అవు తారు; మృత్యువుతో సమానమైనవేదన ననుభవిస్తారు, కానీ తమ బ్రతుకును చంపుకోరు. బ్రతుకును చంపు కోవటం అంటే సహజ స్ఫూర్తిని కోల్పోవటం. తన జీవితానికి గమ్యం అనుకున్న చేతన వేరొకరిదని తెలిసినప్పుడు సౌమిత్రి దాదాపు మృత్యుపీడ ననుభవి స్తాడు. అయితే తనకై తానార్జించుకున్న బ్రతుకును చంపుకోడు. సర్వశక్తులు తన ప్రాణంతో సమానమైన ఫ్యాక్టరీ అభివృద్ధికి వినియోగిస్తాడు. జనజీవనానికి ఆధారమైన ఉత్పాదక శక్తికి నిలయం ఫ్యాక్టరీ. అతను అందులో భాగమై తన జీవితాన్ని పునర్జీవితం చేసుకుంటాడు. చేతన కూడ పారే నీటితో లయబద్ధ మయ్యే తన గుండెను పట్టి వుంచటం మృత్యువుతో సమానమని తెలుసుకుంటుంది. అంతరంగం పిలుపు అందుకొని ఆమె తిరిగి తన జీవితాన్ని పొందుతుంది.

విజ్ఞానం మానవుని వికాసానికి మొదటిమెట్టు. జీవి తపు లోతులు తరచి చూడాలనే జిజ్ఞాస అనుభవ గతమైన దానిని మరింత స్పష్టంగా తెలుసుకోవాలనే కోరిక వ్యక్తి తనను తాను తెలుసుకోవటానికి అవ సరం. జిజ్ఞాసతో జీవితాన్ని అన్వేషించే వారికి ఎన్నో జీవిత సత్యాలు సాక్షాత్కరిస్తాయి. సుధలో ఈ రక మైన జిజ్ఞాస చాల ఎక్కువ. ఆనందం అంటే ఏమిటో జీవితానికి అసలైన ప్రమాణం ఏమిటో తండ్రి నడిగి ఇంకా స్పష్టం చేసుకున్న ఆమె-"ఎవరి జీవితం వారు సంపాదించుకున్నదయితే వారు దానికి సార్వభౌమాధి కారులు. ఇతరుల పెత్తనం ఒకరి జీవితం మీద ఉందంటే వారి జీవితం వారు సంపాదించుకోలేదన్న మాట మొదటికోవకుచెందినవారు అన్నిటికీ అతీతులు అనే నిర్ణయానికి వస్తుంది.

పరిస్థితిని యథాతథంగా స్వీకరించి తదను గుణంగా వ్యవహరించటం, కార్యకారణ సంబంధాలు అన్వేషించకపోవటం-అస్తిత్వవాద ధర్మమే. 'గీత' అలాటి వ్యక్తి.

వివాహం అనేక జీవనవిధులలో ఒకటి మాత్రమే. ప్రేమకు వివాహానికి అనివార్య సంబంధమేమీ లేదు. సౌమిత్రిని వివాహమాడేటప్పుడు చేతనకు ప్రేమ తెలి యదు. అతని భార్యగా సంతృప్తినే పొందింది. కానీ ఆరోహి వల్ల స్పందించిన అంతరంగాన్ని ఆమె కాదను కోలేదు. అందుకే / కొంతకాలం సంఘర్షించినా ఆరోహిను చేరటంలో ఆమెను ఏ బంధమూ ఆపలేదు.

పై వివేచన ద్వారా ఈ నవలలో వ్యక్తి స్వేచ్ఛ, అనుభూతి, జిజీవిష, క్రియాశీలత, జీవస్ఫురణలకు అత్యంత ప్రాముఖ్యత ఇవ్వబడినట్లు తెలుస్తుంది. పోతే సమాజానికి వ్యక్తికి ఉన్న సంబంధమేమిటనే ప్రశ్న ఉదయిస్తుంది. సమాజానికి దూరమైన వ్యక్తి ఉనికికి సార్థకతలేదు. అనంతమైన జలరాశిలో ద్వీపాలవంటి

వారు వ్యక్తులు. సమాజం ద్వీపాలను చుట్టివుండే నీరు లాటిది. ఈ సత్యానికి రచయిత్రి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చినట్లు కనపడదు. పాత్రలన్నిటికి సామాజికత చాల తక్కువ.

నవల చదివిన తర్వాత కలిగే ఆనందంలో రచంత వెలితి తోస్తుంది. అంతర్లీనంగా ఉండవలసినరచయిత్రి ఉద్దేశ్యం ఆదిలోనే బహిర్గతమవుతుంది. తాను నమ్మిన సిద్ధాంతాలకు రూపకల్పనగా పాత్రలను చిత్రించటంలో అస్తిత్వవాదానికి దూరమైన ఆదర్శవాదంచోటు చేసుకుంది. దీనికి ఉదాహరణ అచంచలమైన సంకల్ప శక్తి కలిగి ఏ మాత్రం ఒడుదుడుకులు సంఘర్షణలేని సుధా సమీరులు. సౌమిత్రి ఒక్కడేకొద్దోగొప్పో మానవ మాత్రుడనిపిస్తాడు. చేతన ఆరోహీలు—ప్రేమకు, జీవితాన్ని నిర్వచించటానికి సాధనలుగా అనిపిస్తారు. రచయిత్రి ఉద్దేశించినట్లు జీవితం అంటే ఏమిటో జీవించి తెలుసుకోకుండా ముందుగా నిశ్చితమైన అభిప్రాయాలతో జీవితాన్ని గడపినట్లు వారు కనబడులారు. అందువల్ల ఒక విశిష్ట దృక్పథాన్ని పాఠకులలో కలిగించటానికి బదులు పరిచయం మాత్రం చేయగలుగుతుంది ఈ నవల. బహుశా రచయిత్రి ఉద్దేశ్యం అదేనేమో. అయితే నవల చదివేటప్పుడు మనకేమి తోచవు. కారణం శైలి. భావాలను, అనుభూతులను వర్ణించేటప్పుడు ఆ అనుభూతులు పాఠకుల మనః పటలాలపై సుందర దృశ్యాలుగా హత్తుకుపోతాయి. సంక్షిప్తత కథనానికి బిగువును కల్పించింది.

జీవితానికి రచయిత్రి ఇచ్చిన వాఖ్య జీవితం పట్ల ఆసక్తి కలిగించేదిగాను, ప్రతివ్యక్తి ఒకసారి తనను తాను సమీక్షించుకునేదిగాను ఉన్నది. నిజమే, మానవ శరీరం నేల, నీరు, నిప్పు గాలి, నింగి అంశలను కలిగి వుంది. పాంచభౌతికమైన ఈ శరీరాన్ని సాధనంగా చేసుకుని ఆ ప్రకృతి శక్తులపై అధిపత్యం సాధించటానికి మనిషిచేసే యత్నమే జీవితం. ప్రకృతి శలక్తును తన వశం చేసుకోవాలన్న తృష్ణె జీవశక్తి. తృష్ణను తెలుసుకోవటం జీవస్ఫురణ. వీటిని వెన్నంటి జీవితం పట్ల ఆసక్తి ప్రేమ వుంటాయి. ఏదో ఒక రూపంలో ప్రకృతిపై విజయం సాధించినవారి జీవితం ధన్యం. కళ ద్వార ప్రకృతిపై విజయం సాధించి చేతనా ఆరోహీలు జీవితాన్ని సార్థకం చేసుకుంటే సుధా సమీరలు విజ్ఞానరంగంలో సాధకులై పయనిస్తుంటారు. ఆ సాధనలో వారికి లభించిన సత్యాలు వారి జీవితాలకు భాష్యాలు.

కేవలం హెచ్చులాటకోసం, వ్యాపారసరళిలో పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్న నవలలకు భిన్నంగా, ప్రశంసలు, అభిశంసలతో పని లేకుండా తను నమ్మిన వ్యక్తి సత్యాన్ని శాశ్వత సత్యంగా రూపొందించటానికి రచయిత్రి చేసిన ప్రయత్నమే 'పాంచభౌతికం'. పాఠకునిలో తన అస్తిత్వంపై జిజ్ఞాస రేకెత్తించటంలో చాలవరకు సఫలీకృతమై, ఈ నవల, అస్తిత్వవాద ధోరణిలోవచ్చిన ఉత్తమతెలుగు నవలలో ఒకటిగా గుర్తింపబడగలదని నా అభిప్రాయం.

ఇంటి నం. 14, 11వ క్రాస్ స్ట్రీట్
ఇందిరానగర్, అడయార్
మద్రాస్-20

# వేముగంటివారి కవిత్వము-ఒక పర్యాలోకనము

— M. సీతారామాచార్యులు

వేముగంటి నరసింహాచార్యులు వృత్తిచే ఉపాధ్యాయులు, ప్రవృత్తిచే కవులు, అద్వితీయ కవితా సంపన్నులు. బహుకావ్య ప్రణేతలు. బహుముఖ ప్రజ్ఞావంతులు వీరి కవిత సంస్కృతాంధ్ర సమ్మిశ్రితమై నవరసభరితమై సముచిత వర్ణనలు కలిగి, ఒకచోట పరిమళాలు వెదజల్లుచు మందమారుతమై వీచి, మరొకచోట ఝంఝామారుతమై వీచును. ఒకచోట పరిపూర్ణమైన భక్తిరసమును చిలుకగా, వేరొకచోట వీర రసమును ఒలికించును, ఒకచోట శాంత గంభీరమై, మరొకచోట మార్తాండచండ ప్రతాపమై తోచును.

శ్రీ వేముగంటి వారు సాహిత్యములో ఒకానొక సిద్ధాంతమును, తాత్త్విక దృష్టిని అలవరచుకొని, ఆ సిద్ధాంతము ననుసరించియే రచనా వ్యాసంగము చేయుచున్న ఆదర్శ కవిశేఖరులు. వీరు దాదాపు నాలుగు దశాబ్దములకు పైగా తమ రచనా సుమాలతో ఆంధ్ర సరస్వతిని అర్చించుచున్నారు. ఇప్పటివరకు వీరు రచించిన కృతులు (22) ముద్రణ భాగ్యమునందినవి. ఆధునికాంధ్ర సాహితీ ప్రపంచములో విశిష్టమైనస్థానం అలంకరించిన వారిలో ఆచార్యులు గారొకరు. కలం పట్టిన నాటినుంచి నేటిదాకా కమనీయమైన కవితలు వ్రాస్తూ సహృదయులైన పాఠకుల హృదయసీమలలో శాశ్వతముగా నిలిచిన కవివరేణ్యులు. పద్య, గేయ, వచన కవితలు పరమ రమణీయముగా వ్రాయడమే కాక, చక్కని విమర్శకులుగా వక్తగా సాహిత్య సేవ చేయుచున్నారు

వేముగంటి వారు అత్యంత స్వాతంత్ర్య ప్రియులు. వారు తమ పదునారవ యేటనే "ఎన్నాళ్ళీ విధి సిగ్గుమాలి యకటా. స్వేచ్ఛా విహీనుండవై, అన్నా! కాలము వెళ్ళబుచ్చెదవు లేదా నీకు స్వాతంత్ర్యమున్" అని ఆనాటి నిష్ఠుర నిరంకుశ ప్రభుత్వమునకు జంకక గొంతెత్తి ప్రజలను ప్రబోధించినారు. వీరు గొప్ప దేశభక్తులు. 1965 లో భారతదేశముపై పాకిస్తానీయులు దండెత్తినపుడు ఈ కవికోకిల "వీరపూజ" స్వరముతో దేశద్రోహులను మందలించిన తీరు వారికి గల దేశాభిమానమును చాటుచున్నది.

ఎవడురా పయిపయిన్ నివురు గప్పిన నిప్పు
రవల వెలికి నూద తివిరినాడు?
ఎవడురా పొదరింట పవళించు మృగరాజు
జూలును విదళింప జొచ్చినాడు?
.... ... ...
ఎవడురా వాడు భయమించుకేని లేక
భారతధాత్రిపై దండెత్తి వచ్చినాడు?

శ్రీ ఆచార్యులుగారు మితభాషి, హితాభిలాషి నిరాడంబర జీవనులు. ప్రజ్ఞాపాటవముతో ఉన్నత సాహితీ శృంగము నధిరోహించినను, తనను గూర్చి ఎన్నడును గొప్పలు చెప్పుకొనలేదు. తనకు తెలిసిన వారిని గూర్చి ఎప్పుడును తక్కువచేసి మాట్లాడుట వారికి గిట్టదు వీరు అమోఘ ధర్మానుష్ఠాన పరులు, గొప్ప దైవారాధకులు, ఉద్యోగధర్మమును చక్కగా నిర్వహించుచు, కవితా తపస్సు సాగించి ఈనాడీ స్థాయికి ఎదిగినారు. "కృషితో నాస్తి దుర్భిక్షమ్" అను లోకోక్తి శ్రీ ఆచార్యులగారి విషయములో సార్థక్య

మును గాంచినది. వీరి కవితా విశేషమునకు,పాండిత్య గరిమకు మెచ్చి సాహితీ లోకము వీరికి 'విద్వత్కవి' 'కవికోకిల' అను బిరుదముల నిచ్చి సత్కరించినది.

సమకాలిక సమాజస్థితిగతులకు ప్రకృతి పరిణామాలకూ అనుక్షణం స్పందిస్తూ ఆయా సమయాలలో కవిగారి కలంచే జాలువారిన కవితాఖండికలు ప్రసిద్ధాంధ్ర పత్రికల ద్వారా ఆకాశవాణి ద్వారా ప్రకటింపబడి సహృదయ హృదయములనానందపరచినవి. క్రమంగా వారి రచనలన్నియు 'కృతిరూపం ధరించాయి. ప్రబోధం, కవితాంజలి, నవమాలిక, మణికింకిణి, జీవనస్వరాలు, కవితాకాహళి, మొదలగునవి. ప్రకృతివర్ణనలతో నిండిన దేశభక్తి భరితములైన ఈ కవితాఖండికలు కావ్యకర్తృ వ్యక్తిత్వ ప్రదర్శకాలై ప్రతిభా హెందితీ శిల్పకల్పనలను బహుముఖాలుగాచాటుతున్నాయి.

ప్రకృతి వర్ణనము చేయుటలో యీ కవి అగ్రగణ్యుడు. మణికింకిణి అనే కృతిలో

చిరునవ్వులొలకించు విరికన్నె మోవిపై
మధుర తాంబూల చుంబన మొనర్చి
నిలయోన్ముఖంబైన పులుగు రెక్కలమీద
మొలక లత్తుక పన్నె ముద్రవేసి
కలయిక కుదురని వెలుగుచీకటుల మధ్య
వినూత్నరాగ బంధమును గూర్చి
సరసీతరంగాల పురుటింటి నురుగు
పాపలకు కెంబట్టు పొత్తిళ్లు అమర్చి
అద్రిశిఖరాల పాదచిహ్నముల మలచి
కుజ శిరస్సుల సిందూర రజము చిలికి
ప్రకృతి సౌందర్య లక్ష్మికి మకుటమునిడి
అలరుచుండువందముగ సంధ్యాకుమారి"!

ఈ పద్యములోని ప్రతి చరణం మనకు ఒక ప్రకృతి చిత్రమునందించుచున్నట్లున్నది.

వేముగంటివారు గొప్పదేశభక్తులు. మాతృదేశము పైన వారికి అపారమైన భక్తి, విశ్వాసములున్న విషయమును "ప్రబోధము." గ్రంధమునందు ఎంత హృద్యంగా తెలుపుచున్నారో గమనింపుడు.

"ప్రాణ కర్పూర కళిక నివాళిగాగ
మేని రక్తము కాలి పారాణిగాగ
జీవితమ్మెల్ల" మాతృపదసేవ కర్పింతునని
తమకుగల దేశభక్తిని చాటుకొన్నారు

మంజీరానదిని వర్ణించే మధుర మంజుల గేయకావ్యం "మంజీర నాదాలు". ఇరవై భాగాలుగా సాగిన ఈ కృతిలో మంజీర నది యొక్క సమగ్ర చరిత్ర వివరింపబడియున్నది. మంజీరానది బాలఘాట్ వద్ద పుట్టి, మహారాష్ట్ర కర్నాటక ప్రాంతాల మీదుగా తెలంగాణా ప్రాంతమునకు వచ్చినదట. తెలుగువారి పుణ్యఫలమే మంజీరానది ప్రాదుర్భావమునకు మూలమట. చివరకు ఆదిలాబాద్ జిల్లాలో వాసర క్షేత్ర ప్రాంతమున పవిత్ర గోదావరిలో లీనమగునట. ఈ విషయముల నన్నింటిని కవిగారు పరమ రమణీయముగా వర్ణించి, మంజీరా నది యొక్క వైశిష్ట్యమును మన కన్నుల ముందుంచినారు. కావ్యమధ్యంలో మంజీరా స్థితిగతులను, ఆరు ఋతువులలో నది పొందిన అనుభూతులను మనోజ్ఞంగా వర్ణించి పాఠకుల కానందం కల్గించినారీ కవిశేఖరులు.

వాకగా కార్తికిక రాకగా
కవిభావ టీకగా తెలి పట్టుకోకగా
పీకగా, వచ్చినది మంజీర
తెచ్చినది మధుధార"

వంటి చరణాలు వస్తు నవ్యతా విశేషమును వ్యక్తము చేయుచున్నవి. గేయరచనలో వీరికి గల ప్రతిభను చాటుచున్న దీ కావ్యము.

శ్రీ వేముగంటి వారు 1979 సం॥న ఆంధ్రప్రదేశ ప్రభుత్వముచే నిర్వహింపబడిన ప్రపంచ తెలుగుమహా

సభల సందర్భముగా "ఆంధ్ర విష్ణువు" అనే కావ్యాన్ని రచించి తమ ఆంధ్రాభిమానాన్ని ప్రదర్శించిన విషయము జగత్ప్రసిద్ధమే. ఈ కావ్యములో కవిగారు ఆంధ్ర విష్ణువు ప్రాశస్త్యకు గల దైవత్వాన్ని సహేతుకంగా సమర్థించిన విషయము పాఠకుల మెప్పు నందింది.

ఈ కావ్యములో వీర, రౌద్ర రసాలు చక్కగా పోషింపబడినవి. నాటి యుద్ధ వ్యూహములు మాది సైన్యాల వెనువెంటను జాగిరపు ఆంధ్ర విష్ణువు పల్ ........

"పుత్రరత పేడి మాటకొ చున్ వచనాజ్ఞలు,
నందు వీరతాముద్ర".. ...

అనే పలుకులో కావ్యగత రసములు అవిష్కృతమైనవి.

"కొండలు పిండి సేయగ" "భండన భీములుగా" "ముక్కడులై పొలిమేరల" వంటి పద్యములలోని పటుతర సమాస చాలనం పరుషాక్షర సమ్మేళనం ఏతత్ రసానుగుణంగా సంయోజింప బడినవి. ఈ చిన్ని కావ్యంలోని కొన్ని పద్యాలు ధ్వని సుందరములై భాసిస్తున్నాయి. ఉదాహరణమునకీ క్రింది పద్యమును చూడుడు.

ఆంధ్ర విష్ణువు స్వరూప స్వభావములను చిత్రించే "ఘనుపొందళు" పద్యములో చివరకు "మేలోన ముల్ పూవులు పూయు కల్పతరువై లోకప్రశంసల్ గొనెన్" అని అన్నపుడు తర్వాతి కాలాన ఆంధ్ర విష్ణువు దేవమూర్తిని వహించి భక్తుల పాలిట కల్పతరువై అఖిల భూజన పూజనందుకుంటాడను వస్తువు ధ్వనిస్తుంది. ఛందశ్శిల్పం ద్వారా కూడా ఈ కావ్యకర్త వ్యంగ్యాన్ని సాధించారు.

"విమలశ్రీ ఉదయాచలాగ్రము పయిన్" అన్న పద్యంలో భద్రకరిపై కూర్చొని యుద్ధానికి వస్తున్న ఆంధ్ర విష్ణువును మత్తేభ వృత్తంలో వర్ణించి "నాగమ దీక్షించి" అను చిన్న కంద పద్యంతో వర్ణించడము నాయక ప్రతినాయక బలాలకు ఒకవైపు అద్దం పట్టునే యుద్ధంలో ఆంధ్ర విష్ణువునకు విజయం తప్పదనే వస్తుధ్వనిని వెలయింప చూపుట కడు ప్రశంసార్హముగా నున్నది.

ఆంధ్ర చరిత్రలో కాకతీయుల కాలము స్వర్ణము. అందును గణపతిదేవ చక్రవర్తి కాలం నిత్య కళ్యాణం పచ్చతోరణం. నాటి తెలుగు విన్నాణం వర్ణింపనలవి కానిది. కాకతి ప్రభువుల కీర్తికి కారకులైన వారిలో మహాకవి "తిక్కన సోమయాజి గారు" ఒకరు. ఈతని ప్రతిభా పాండిత్యములు అసామాన్యములు. వీరి ప్రభుభక్తి, దేశభక్తి మహాభారత రచన మున్నగు విషయముల సాకల్యముగా పాఠకులకందించి ప్రాచీన కవుల చరిత్రను అజరామరము చేయవలయు ననెడి తలంపుతో శ్రీ వేముగంటి వారు "తిక్కన" అను పేర పద్యకావ్యమొకటి రచించిరి. వేముగంటి కృతులన్నింటికీ మణికిరీటం "తిక్కన కావ్యం". వేముగంటిని సాహితీ గౌరీశంకర శిఖరం పైన నిలబెట్టిన ఈ కావ్య విశిష్టతను క్వాచిత్కముగా వివరించెదను.

ఈ కావ్యంలో (4) ఉల్లాసములు గలవు నెల్లూరును రాజధానిగా చేసికొని 13-14 శతాబ్దముల కాలమున ఆంధ్రదేశమును పాలించిన మనుమసిద్ధి ఆస్థానములో తిక్కన మహామంత్రిగా, ఆస్థాన పండితుడుగా ప్రజాసేవ చేసిన ప్రతిభాశాలి. ఈ కావ్యం నిండా శ్రీ వేముగంటి వారు సందర్భోచితములైన వర్ణనలు చేసి తెలుగు పరిమళాలు గుబాళింపచేసిరి. తిక్కన ఓరుగంటికి పయనించు సమయమున మార్గ మధ్యమున ప్రకృతి రమణీయతను వేముగంటివారు కన్నులకు కట్టినట్లు వర్ణించిరి. వీరు సీసపద్యములను అందముగా వ్రాస్తారు సీస పద్య రచన చేయుటలో వీరు అద్వితీయులు వీరి సీసములు శ్రీనాథుని సీసములను తలపునకు తెచ్చునవిగా యుండును.

మచ్చునకు ఒకటి రెండు పద్యములు చూపుదును.

ఒక వంక నెల వంక చికిలి వెన్నెల గాయ
కౌస్తుభరత్న మొక్క దెసమెరయ
నాభి పంకజమందమజార నొక్కెడ
గంగమ్మ ఒక చాయ పొంగులెత్త
శ్రీవత్స మొక త్రేవ ముద్దులు గార
ఒక దిక్కు విసపు కుత్తుక చెంగ
ఒకచాయ వ్యాఘ్రాజినోత్తరీయం బొప్పం
పట్టు పుట్టంబొక్క వంక వెలుగ
కను మిరుమిట్లు గొలుప సాక్షాత్కరించి''

రూప కల్పనము చేయుటకు తగినట్లుగా ఈ కవిశేఖరుడు వర్ణించుచుండును. పింగళి సూరనగారి పద్యములవలె యెంతో మనోహరముగా పద్యముల రచించుట యీ కవియొక్క ప్రత్యేకతగా తెలియుచున్నది.

దేశానికి వెన్నెముక రైతు, అందరికి అన్నంపెట్టె కర్షకుని జీవితం పవిత్రమైనది. శ్రీ వేముగంటి "కర్షకుడు'' అనే శీర్షికలో కర్షకుని కష్టజీవితాన్ని చక్కగా చిత్రించినారు.

పండుసిప్పల వంటి మండుటెండలలోన
కరగి పోయినది నీ కండపుష్టి
ధనిక వర్గంబుల ఋణపిశాచమునకు
బలియైనదకట నీ భాగ్యరేఖ
స్వేదజలంబు గావించక భూదేవి
త్రాగెను నీ దేహ రక్తమెల్ల
ప్రజల పరోపకారమునకై నష్టపట
గలసె నీ యాలు బిడ్డల సుఖంబు
"నీదు బాహుబలంబు పునాదిజేసి
కుడువ కూడును మైకట్టు గుడ్డలేక"

పేదకర్షకుడు జీవిస్తున్నారని ఎంతో ఆవేదనతో వరించినారు.

వీరరసమును పోషించుచు ఈ కవిచంద్రుడు "బాలచంద్రుడు" అను కవితను రచించి, యువలోకమునకు పౌరుష ప్రాభవముల బోధించినాడు,

"కందిన వాడి ఖడ్గముల
గాయపు చిల్లులనుండి నెత్తురుల్
చిందు దొరంగినన్ సరకు
సేయక శత్రు శిరంబు కత్తి కో
నందగిలించి తెచ్చి జత
నంబుగ తండ్రికి జూపినావు నీ
కుందనపు వీరుడీ తెలుగు
కంఠినిపై మరల్ జనించునే"

ఈ విధముగా ప్రవాహపు వేగంలా పరుగులెత్తుచుండును ఈ కవిరచనము.

శ్రీ వేముగంటి నరసింహాచార్యులుగారి "వేంకటేశ్వర వినుతి" అను పద్యకావ్యం మధురభక్తి గీతాల స్తుతిమాల. ఇందుమాత్రాఛందస్సు ప్రయుక్తమై వుంది.

ఈ విధముగా వేముగంటి వారి రచనలు పాఠకలోకమును మైమరపించుచుండును. మెదక్ జిల్లాలో గల కవిబృందమునకు ఆద్యులై, ఆచార్యులై సాహిత్య సేవచేయుచు, "సాహితీ వికాసమండలి" అను సాహితీసంస్థనొకదానిని స్థాపించిబహుముఖముగ భాషాసేవ చేయుచున్న వీరి రచనలు అవశ్య పఠనీయములై యున్నవనుటలో యతిశయోక్తి ఎంతమాత్రమును లేదు

శ్రీ వేముగంటి నరసింహాచార్యులు గారు తమ రచనల ద్వారా నిద్రాణమై యున్న యువతను జాగృతమొనర్చి భారత జాతి కీర్తి ప్రతిష్ఠం నిలబెట్టుటకై దీక్ష పూనుట హర్ష దాయకమైన విషయము.

సిద్దిపేటలో గల సాహితీ వికాసమండలికి అధ్యక్షులుగా "లలిత కళా సమితి" లో కార్యవర్గ సభ్యులుగా, ఆంధ్ర సారస్వత పరిషత్ గౌరవ సభ్యులుగా, సాహిత్య అకాడమీ సభ్యులుగా, ఆంధ్ర సరస్వతికి అపారమైన సేవచేయుచున్న సహృదయ శిరోమణి శ్రీ వేముగంటి.

"వేముగంటిలోన వేమున్నదే గాని
లోతు హృదయమెల్ల అమృతమయము
నారసింహు పద్య ధార కంజలి పట్టి
నమస్కరింతు సకల జగతిలోన" అని మహాకవి శ్రీ దాశరథి గారు యాశించిన విధముగా వీరి కృతులన్నియు యువలోకమునకు పరిచయము కావలసిన యవసర మెంతైనా కలదు. ప్రముఖ కవి పండితులచే శ్లాఘింపబడిన శ్రీ వేముగంటి వారి సాహిత్యము ఇతోధికముగా జగత్ప్రసిద్ధి పొందవలయునని ఇందుకు తగిన యవకాశమును కల్పింపుమని భగవంతుని శతధా వేడుచున్నాను.

ఆంధ్రోపన్యాసకులు
ప్రభుత్వ జూనియర్ కళాశాల
భిక్కనూర్, జి॥ నిజామాబాద్

# తపన

నర్సింగోజు లక్ష్మయ్య

నా కళ్లు ఆకాశంలోకి
చూస్తున్నాయి, పరిశీలనతో
నా గుండె వేగంగా
కొట్టుకుంటుంది, పరధ్యానంతో
నాలోని ప్రతి అణువు
కంపిస్తుంది, అంతులేని ఆవేశంతో
మనసు ఆరాట పడుతుంది, ఆవేదనతో
ప్రతినిత్యం జరిగే జీవన పోరాటంలో
ఏదో తెలుసుకోవాలని ఆరాటం
ఎదలోయల్లో భావపరంపరలు
అవి హృదయాంతరాళాన్ని
ఛేదిస్తున్నాయి
అందుకే ఆతృతతో
ఆకాశం వైపు చూస్తున్నాను, పరిశీలనతో
కాని నాకు కనిపించింది శూన్యం
శూన్యాన్ని తీక్షణంగా చూస్తున్నాను
చైతన్యాన్ని భరించలేక
ఎక్కడో ఏమూలనో-
పొడసూపుతున్నాయి
మినుకు మినుకు మంటూ
"స్వార్థం" నిప్పు రవ్వలతో
చెలగాట మాడుతుంది.
'అసూయ" దానికి - ఆజ్యం పోస్తుంది.
"కలిసి బంధాల్ని - త్రెంచుతుంది
'ద్వేషం" దివ్యదేవతగా- వర్ధించ బడుతుంది
'ప్రతిష్ఠ" నడిబజారులో - పతితయై తిరుగుతుంది.
'మౌనం" జీవిత సత్యాన్ని- భరించలేనంటుంది.
'ఆవేశం" అవధులను- దాటుతుంది.
ఆలోచనల అలలు
సముద్రాన్ని కలచివేస్తున్నాయి
ఆశనిరాశల ఎత్తు పల్లాల్ని దాటి
నేనపుడు శూన్యంలోకి పోతున్నాను.

# ప్రియదర్శన

## (శ్రీహర్ష రచితము)

అనువాదము : కాకరపర్తి ముఖలింగ శర్మ

### నాటిక యందలి పాత్రములు

పురుషులు

| | | |
|---|---|---|
| 1. | వత్సరాజు | ఉదయన మహారాజు |
| 2 | వసంతకుడు | విదూషకుడు, వేడుక చెలికాడు |
| 3. | రుమణ్వంతుడు | మంత్రి |
| 4. | విజయసేనుడు | సేనాధిపతి |
| 5. | కంచుకి | అంతఃపుర రక్షకుడు |

స్త్రీలు

| | | |
|---|---|---|
| 1. | వాసవదత్త | వత్సరాజు పట్టపురాణి |
| 2. | ఆరణ్యిక | ప్రియదర్శన, దృఢవర్మ కూతురు, వాసవదత్త పినతల్లి కూతురు. |
| 3. | చేటి | దాసి |
| 4. | మనోరమ | ఆరణ్యికకు అనుంగు చెలి |
| 5 | సాంకృత్యాయని | నాట్యకర్త్రి ..రాణినానందింపజేయును. |
| 6. | ఇందీవరిక | రాణి చెలికత్తె |
| 7. | కాంచనమాల | రాణి చెలికత్తె |
| 8. | ప్రతీహారి | ద్వారపాలకుడు |

శ్రీహర్ష విరచిత నాటకానువాదము వరుసగా ప్రచురించుచున్నాము.

సం॥

# ప్రియదర్శన

## (శ్రీహర్ష రచితము)

అనువాదము : కాకరపర్తి ముఖలింగము

### ప్రథమాంకము

#### నాంది

శా॥ ధూమవ్యాకుల దృష్టియై, పిదప సంతుష్టాశియై చంద్రుచే,
ప్రేమన్ భర్తను చూచి, బ్రహ్మయెడఁ దాభీతిల్లి, వాత్సల్యదలన్,
శ్రీ పర్వాటినఖేంద దక్షిణగతిన్ శ్రీకంఠు గంగాధరున్
సాక్షాంబుగఁ గాంచి, గైకొనెంచో స్పర్శన్ గగుర్పాటుచే
నేమ సాక్షియైనంగు- నామె శివ మీకిమ్మన్ శుభంబుల్ సదా

సీ॥ కైలాస గిరియల్లఁ గదలాడి యెగయెగా
గణములన్నియు కౌతుకమ్ము నొంద
బాలుఁడౌ స్కందుఁడు భయముతోఁ దనతల్లి
క్రోడంబులోఁ జేరి గునియు చుండఁ
గోపించి విషము గ్రక్కుచు శివాలంకార
భుజగ రాజంబులు ఫూత్కరింపఁ
దద్దు పాదాంగుష్ఠమును మోపి నొక్క. రా
వణుడు పాతాళమ్ము పరిధి కాగ

గీ॥ భయము తోడుత పార్వతి వచ్చి తనకు
నిండు కౌగిలి యీయగా నిచ్చమెచ్చి
అంతవరకెంతో క్రుద్ధత నందియున్న
శివుఁ డొసంగుత శుభములు చెలగి మీకు !

#### నాంద్యంతమున

సూత్రధారుడు :- ఇపుడు వసంతోత్సవమందు అన్ని (పరిక్రమించి) దిక్కుల నుండి వచ్చిన శ్రీ హర్ష దేవుని పాద పద్మోప జీవులగు రాజులు సగౌరవముగ నన్నుఁ బిలిచి "మన ప్రభువులగు శ్రీహర్ష దేవులచే నపూర్వ వస్తురచనాలంకృత యగు 'ప్రియదర్శన' యను నాటిక రచింపబడినదని మేము విని యుంటిమి. ప్రయోగింపఁబడగాఁ జూడలేదు. అందుచే సకల జన హృదయాహ్లాదకారియగు రాజు యొక్క బహుమానము వలనఁ గాని, మా యందలి యనుగ్రహ బుద్ధివలనఁ గాని యథాతథముగ నటింపఁ జేయదగు" నని పల్కిరి. కావున నైపథ్యరచన యొనరించి వారు కోరిన దానిని నెరవేర్తును. (అన్ని దిక్కులు అవలోకించి) సామాజికుల మనస్సులభిముఖములు .చేసికొనబడినవనియే నా నిశ్చయము

చ॥ నిపుణుండౌ కవి హర్షరాజు ! సభయా! నిచ్చల్ గుణగ్రాహి, యీ
విపులన్ వత్సనరేశు వృత్తము రసోపేతంబు ! నాట్యంబులో
నిపుణుల్ మేమిటు వాంఛితాప్తి కొకచేనిన్ జాలి యుండన్ సుధీ
కృపచే భాగ్యవశాన సర్వగుణ సంకీర్ణత్వ మేపారె డిన్

(తెరవైపు చూచి)

ఓహో ! నేను ప్రస్తావన కుద్యుక్తుఁడనగు చుండ నా యభిప్రాయము నెరింగిన వాడువలె మా తండ్రి అంగరాజు దృఢవర్మ ప్రభుని యంతఃపుర కంచుకి రూపము ధరించి ఇటే వచ్చుచున్నాఁడు. ఇంతలోనేను తరువాతి వేషము ధరింతును. (నిష్క్రమించును)

(ఇది ప్రస్తావన)

(పిమ్మట కంచుకి ప్రవేశించును)

కంచుకి:- (శోకముతో కూడిన శ్రమను నటించుచు నిట్టూర్చి) కష్టమయ్యా ! కష్టము !

గీ॥ ఒదయు నాపద, బంధువియోగదుఃఖ
మాత్మదేశము విడుచుట. యర్థఖేద
మనెడి ఫలములు నిప్పులంబై కఠోర
మయిన నా చిరజీవిత మనుభవించె !

(సశోక విస్మయముగ) అడ్డులేని శక్తిత్రయము కలిగి నల దిలీపులతో సమానుడగు అట్టి దృఢవర్మకు ఎంత కష్టము వచ్చెను ! తాను కోరినను దృఢవర్మ, కుమార్తెయగు వాసవదత్తను వత్సరాజున కిచ్చెనను దీర్ఘ ద్వేషము గల కళింగ హతకుడు, వత్సరాజు బంధింపబడియున్నాడని తెలిసికొని, యిట్టి యాపద కలిగించుట సత్యముగ జరిగినను నమ్మలేకున్నాను. మా యెడ దైవమింత నిష్ఠురముగ నున్నది. ఏదో విధముగ రాజకుమారిని వత్సరాజునకు సమర్పించి స్వామిని ఋణహీనునిగఁ జేయుదునని తలంచి, ప్రళయకాల దారుణమగు శత్రుకృత నిర్బంధమునుండి తప్పించి, దృఢవర్మ మహారాజునకు మిత్రుడగు ఆటవికరాజు వింధ్యకేతు గృహమున రాకుమారి నుంచితిని అగస్త్యతీర్థ మిచ్చటకు దగ్గరలోనే యుండుటచే స్నానమునకురాగా, క్షణములోనే యెవరో రక్కసులవలె వింధ్యకేతువుపైఁబడి అమానుషముగ నగరము కాల్చివేసిరి. రాకుమారి యెట్టి అవస్థలోనున్నదో తెలియదు, నేనాప్రదేశము నంతయు నేర్పుగవెదకితిని. ఆమె నా దొంగలెత్తుకొని పోయిరో, లేక అగ్నిలోఁబడినదో తెలియదు. దురదృష్టవంతుడగు నేనిప్పుడేమి చేయుదును? (ఆలోచించి) వత్సరాజు, బంధనము నుండి తప్పించుకొని వాసవదత్తనపహరించి కౌశాంబి చేరినాడని వినియుంటిని. అచ్చటికే వెళ్ళుదునా? (నిట్టూర్చి తన యవస్థను చూచుకొనును) అయ్యో! రాజపుత్రి లేకుండ నక్కడకు వెళ్ళి నేనేమి చెప్పుదును? దృఢవర్మ, గాఢ ప్రహారములచే శిథిలీకృత శరీరుడై బంధింపఁబడి యుండెనని వింధ్యకేతుఁడు నాతో చెప్పియున్నాడుకూడ. కావున నిప్పుడు ప్రభువు దగ్గరకేపోయి నా జీవిత శేషమును సఫలీకృత మొనరింతును. (అంతటను తిరిగి మీదికిఁజూచి) అహా! శరదాతపమెంత దారుణముగనున్నది? సంతప్తునకుఁ గూడ మిక్కిలి తీక్ష్ణమనిపించుచున్నది.

గీ॥ తొలుత ఘనబంధనము నుండి తొలగి పిదపఁ
గన్యగ్రహియించి తులఁబొంది ఘనత మీఱ
తనదు ధామంబు చెందిన తపనుఁడిపుడు
వత్సరాజువలెన్ దాను వరలెను గద !

(నిష్క్రమించు చున్నాడు)

ఇది శుద్ధ విష్కంభము

(పిమ్మట రాజును, విదూషకుడును ప్రవేశించు చున్నారు )

వత్సరాజు :- తెలిసె నమాత్య శేముషియు, దెల్లము
భృత్యుల నమ్మకంబులున్
తెలిసెను మిత్రులెవ్వరిటఁ దెల్లము
పౌరుల యాదరంబు శ
త్రుల గెలువంగ సంగర విధుల్
నెరవేరిన, వంగనామణిన్
వలచితి బంధనంబున, నవశ్యము
ప్రాప్యము లేది కేమియున్.

విదూషకుడు: ఓయి వయస్య ! ఆ చెడు బంధనమునే యేల పొగుడు చుంటివి? క్రొత్తగా పట్టు వడిన గజపతి వలె గలగలలాడు లోహ శృంఖలలచేఁ దొట్టుపడు చరణములు గలిగి, శూన్యముఖ పద్మముచే సూచింపబడిన హృదయ సంతాపము గలవాడవయి, కోపవశోత్తంభిత దృష్టి కలవాడవై నేలమీదఁ గూర్చొని రాత్రు లందు నిద్రపోలేదు కదా !

రాజు :- వసంతక ! నీవు దుర్జనుడవు కదా! చూడు !

శుద్ధసీసము॥ కటిక చీకటి నీవు కనుగొంటివే కాని
కాంతాముఖేందుని కాంతిఁ గనవు
సంకెల చప్పుళ్లఁ గింకఁ జెందితి వామె
తియ్యని పల్కుల తీరుగనవు
బంధన దోషంబు పరికింతువే గాని
ప్రద్యోతసుత గుణపంక్తిఁ గనవు
నిగళ బంధనమునే నిందించు చుందువు
సుఖబంధమైనట్టి చొప్పు గనవు.

విదూ॥ (సగర్వముగ) ఆ నిగళ బంధనమే సుఖబంధనమైనచో దృఢవర్మను బంధించినాఁడని కళింగ రాజుపై కత్తి నూరుచుంటి వేల ?

రాజు:- (నవ్వి) ఛీ! మూర్ఖ ! అందరును వత్సరాజులు కారు. వత్సరాజు మాత్రమే వాసవదత్తను పొంది బంధనము నుండి వెడలఁగలడు. సరే ! ఆ కథ అట్లుండనీ ! చాల దినములయినది. వింధ్యకేతునిపైకి విజయసేనుని పంపి, నేటివరకతని యొద్ద నుండి యెవ్వడును రాలేదు కావున అమాత్య రుమణ్వంతుని పిలిపింపుము. అతనితో కొంచెము సంభాషింప గోరుచున్నాను.

(ప్రతీహారి ప్రవేశించి)

ప్రతీ॥ జయము జయము మహారాజా ! విజయసేనుడు, అమాత్య రుమణ్వంతుఁడును ద్వారభూమి యందు వేచియున్నారు.

రాజు:- త్వరగ ప్రవేశ పెట్టుము.

ప్రతీ॥ మీరాజ్ఞాపించినట్లే. (అని నిష్క్రమించును)

(పిమ్మట రుమణ్వంతుఁడు, విజయసేనుడు ప్రవేశింతురు.

రుమ॥ (ఆలోచించి)

గీ॥ సేవకులు రాజకులమును చేరి తఱచు
తప్పుచేసిన భంగిని దడయ కపుడె
తరలు చుందురు; దోషమింతయును లేక
జంకుగొంకుల- లోనికి సాగుచుంద్రు.

(సమీపించి) దేవా! జయము, జయము.

రాజు: (ఆసనమును చూపి) రుమణ్వంత ! ఇటుఁ గూర్చుండుము.

రుమ:- (కూర్చొని) ఈతఁడే వింధ్యకేతుని జయించిన విజయసేనుడు ప్రణమిల్లుచున్నాడు.

విజ:- (నమస్కరించు చున్నాడు.)

రాజు:- (సాదరముగఁ కౌగిలించుకొని) క్షేమముగ నుంటివి కద!

విజ:- ఇప్పుడు స్వామి ప్రసాదము వలన

రాజు:- విజయసేన కూర్చుండుము.

విజ:- (కూర్చుండును.)

రాజు.- విజయసేన ! వింధ్యకేతు వృత్తాంతమును చెప్పుము.

విజ:- ఇంకనేమి చెప్పుదును. తమరాతనిపై కోపించి నారు గద !

రాజు:- అయినను విస్తారముగ విననగోరుచున్నాను.

విజ:- అవధరింపుడు ప్రభూ! ఇట మేము ప్రభునాజ్ఞ శిరసావహించి కరితురగ పదాతి సేనలతో ఇంతటి దీర్ఘ మార్గమును మూడు రోజులలో దాటి, ఉదయ కాలమున వింధ్యకేతువుపై హఠాత్తుగ పడినాము.

రాజు : తరువాత, తరువాత

విజ : అతడును మాసేనా కలకలము నాకర్ణించి, వింధ్య గుహ నుండి మేలుకొన్న సింగము వలె లేచి, బలవాహనముల నపేక్షింపకయే అప్పటి కప్పటికి చేరుకొన్న కొద్దిపాటి సేనతో తొందరగ వచ్చి మాతో తలపడుటకు సిద్ధ పడెను

రాజు : (రుమణ్వంతుని సస్మితముగ చూచి) వింధ్య కేతుసికిది శోభించినది. తరువాత, తరువాత.

విజ : తరువాత రెట్టించిన మత్సరోత్సాహములు కల మాతో మహా గర్వముతో ఎక్కటియై వృద్ధి నొందిన బలక్రోధ వేగములు గలవాడయి దారుణతరముగ యుద్ధ మొనరించెను.

రాజు : సాధు! వింధ్యకేతూ! సాధు!

విజ : ఇంక వర్ణించుట కేమున్నది! సంక్షిప్తముగ విన్నవింతును.

శు॥సీ॥ తన యురఃక్షేపమాత్రన పదాతి దళంబు
మర్దించి, బాణ సంభ్రమము చేత
హరిణ కులము భంగి నశ్వసేనను దెసల్
పరుగిడఁ జేసి యా పయిని తాను
సర్వత్ర తిరుగుచు సర్వాయుధంబుల
నివహము విడి కత్తినే గ్రహించి
కరికరకదళికాననచ్ఛేదము
లీలతోఁ జేయంగఁ బాలుపడుచు.

గీ॥ ఖడ్గకిరణ స్ఫురద్బాహు కాంతి మీర
నొక్కఁడే మూడు బలముల యుక్కడంచి
శస్త్ర శత ఘాతములను జర్జరిత దేహు
డగుచు హతుఁడయ్యెనలయుచు నాజియందు

రాజు :- రుమణ్వంత! సత్పురుషకులోచిత మార్గము ననుసరించు వింధ్యకేతుని మరణముచే నిజ ముగా మనము సిగ్గిలవలసియున్నది

రుమ :-దేవా! గుణ పక్షపాతులగు మీవంటి వారికి శత్రుగుణములీరీతి ప్రీతి కలిగించు చున్నవి గదా!.

రాజు :- విజయసేన! వింధ్యకేతునకు సంతాన మేద యినఁ గలదా? ఈ నా పరితోషమునకు ఫలము చూపింతును.

విజ :- దేవా! అదియు విన్నవింతును. ఈ విధముగ సబంధుపరివారముగ వింధ్యకేతుఁడు చంపఁ బడఁగా-అతని దేవేరులు అతని ననుగ మింపగా, జానపదులు వింధ్యశిఖరము నాశ్ర యింప నాస్థానమంతయు శూన్యమయ్యెను.

"హాతండ్రీ! హా తల్లీ!" అని దీనముగ విల పించుచు వింధ్యకేతుని గృహమున సత్కులో చితరూపముగల ఒక కన్యయుండెను. అతని కూతురని మేమామెను, తెచ్చితిమి. ద్వారదేశ మున నున్నది. ఆమె నేమె చేయవలెనో" తమరే నిర్ణయింపవలెను.

రాజు :- యశోధరా! వెళ్ళు, నీవే వాసవదత్తకామెను సమర్పించి "ఈమెను చెల్లెలుగ భావించి, ఎల్ల ప్పుడు చూచుకొనుము. గీతమృదంగ వాద్యా దులను, ప్రత్యేకించి కన్యకుచితమైన సర్వ మును నేర్పింపుము. వరయోగ్యురాలైనపుడు

మాకు జ్ఞాపకము చేయుమని మామాటగ
చెప్పుము.

ప్రతీ :- ప్రభువు లాజ్ఞాపించినట్లే. (అని నిష్క్ర
మించును ) (తెరలో వైతాళికులు)

వై॥సీ॥ మంగళ స్నాన సామగ్రి సంపాదింప
నంతఃపురాంగన లందరిపుడు
ఆయాసమునఁ బైట లపనయించుట చేత
మిసమెసలాడెడు మేలికుచము
లొప్పుగా తిరుగుచునుండఁ దానపుచోటు
వరభర్మ కుంభ సంభరితరీతి
కనువిందు సేయుచుఁ గలకలలాడెడి
మధ్యాహ్న సమయంబు మహిపవర్య!

రాజు : (మీదకుఁ జూచి) ఏమీ! భగవంతుఁడగు
సహస్ర కిరణుడు నభోమధ్యమును జేరినాడే.

ఉడుకు నీటను చేప లుద్వర్తనంబును
చెందుట పండెడి చెలువు తోచె
నృత్తలీలలు లేక నెమలి పింఛము నెల్ల
ఛత్రంబు వలె నుంచ సాగెఁ దలను
పాదుల నీటిని పానంబు చేయఁగా
జింక పిల్లలు చేరెఁ జెట్ల నీడ
విడిచి కపోలంబు వెంటనే తుమ్మెద
కరికర్ణపాళిని నిరవుగానియె.

రుమణ్వంత! లెమ్ము, అభ్యంతర గృహము ప్రవే
శించి యథోచిత క్రియలు నిర్వర్తించి, విజయసేనుని
సత్కరించి కళింగహతకోచ్ఛిత్తికై పంపుదము.

అందరు నిష్క్రమించుచున్నారు.

ఇది ప్రథమాంకము.

# భూప్రపంచం లోనికి

మూలం : అధోషాఘరోవిచ్ (యుగోస్లోవియా)
తెలుగు . టి శ్రీరంగస్వామి

నన్ను పుష్పంలో వీక్షించకపోతే
నన్ను కవిత్వం ద్వారా విశ్లేషించకపోతే
శీత, వాతాతపాలకు మిమ్ములను గురి చేస్తాను.
నీ కలయికే
ఒక వినూత్న సృష్టి
నువ్వేదో వైవిధ్యం చేకూరుస్తావని ,
మేము ఆసతో వస్తాం
ఏదో ఒక సమ్మోహన శక్తి
నన్నెటో లాక్కు వెళుతుంది
నువ్వు ఒక వైవిధ్యాన్ని చేకూరుస్తావని
మేము ఆశతోనే నిష్క్రమిస్తాం.

5-11-114/4, విద్యారణ్యపురి,
వరంగల్-506009.

# సాహిత్యగోష్ఠి

## కవి సమయం: స్వరూపం-స్వభావం

### 1. కవిసమయ అర్థం

సమయాః శపథాచార కాలసిద్ధాంత సంవిదః
సంకేతే సమయః ప్రోక్తోనియమేవఽసరేపిచ- ఇతి శేషః॥

అని అమరకోశం 'సమయ' శబ్దం శపథానికి, ఆచారానికి, కాలానికి, సిద్ధాంతానికి, జ్ఞానానికి పేరు. సంకేతానికి, అవసరానికి, నియమానికి కూడా పేరు. 'సమ్యక్ ఈయతే అనేనేతి సమయః ఇణ్ గతౌ-' దీని చేత తెలుసుకోబడుతుంది కాన సమయం. రామాయణ మహాభారత కావ్యాల్లోనూ సమయశబ్దం నియమ నిబంధనార్థంలోనే వాడబడింది. ఈ విధంగా సమయ శబ్దం భిన్నార్థాల్లో ప్రయోగింపబడినా మౌలిక లక్ష్యం మాత్రం ఒకటే. 'సమాన ఆచరణం' అనే అర్థాన్ని స్ఫురింప జేస్తూవుంది. దీని ప్రకారం కవిసమయ శబ్దార్థం 'కవుల సమాన ఆచరణ' మని చెప్పవచ్చు.

కవిసమయ పుట్టుపూర్వోత్తరాలను గూర్చి మొట్ట మొదట తెలియ జేసినవాడు సంస్కృత లక్షణకారుడైన రాజశేఖరుడు. ఇతని ప్రకారం "పూర్వ విద్వాంసులు సహస్రశాఖలు కలిగిన వేదాలను అవగాహనం చేసుకొని, శాస్త్రాలన్నింటిని తెలుసుకొని దేశాంతరాలను, ద్వీపాంతరాలను పరిభ్రమించి గ్రహించినవి అనుభవించినవి అయిన అనేకవిషయాలను దేశాంతర-కాలవశాన అవి అన్యవిధంగా తోచినా అదే విధంగా నిబంధించటం, తత్రదసోచితంగా సాధు కల్పనలు చేయడం కవి సమయం" అనబడుతుంది. వీటికి మూల స్వరూపాలు తెలియకపోయినా పూర్వప్రయోగాలను మాత్రమే దర్శించిన వారిచే ఈ కవి సమయాలు ప్రయుక్తాలై రూఢులై పోయినాయి. కవి సమయ స్వరూపంలో కావ్యాల పరంపరాగతమైన అర్థాల మర్యాద రక్షణకోసం కవి సమయాలు ప్రయోగింప బడుతున్నాయని రాజశేఖరుని ప్రశంసవల్ల తెలుస్తూవుంది.

రాజశేఖరునికి పూర్వం దండి భామహుడు అనే లాక్షణికులు ఈ కవి సమయార్థ నిబంధనం దోషమని భావించి అర్థనిరూపణ చేయలేదు. కాని రాజశేఖరుడిట్టి పరిస్థితిలో కవి సమయాలకొక మౌలికార్థాన్ని తెలియజేయడానికి ప్రయత్నించాడు, తనకుపూర్వం వెలసిన కావ్య ప్రయోగాలను గ్రహించి సోదాహరణంగా కవి సమయార్థ నిరూపణ గావించాడు. కవి సమయాలు కవుల అశాస్త్రీయ, అలౌకిక కల్పనలే అయినా అవి దోషయుక్తాలు కావని, అవి మానవీయ సౌందర్యాన్ని అభివ్యక్తం చేసేందుకు కల్పింపబడినవని విశదీకరించాడు. రాజశేఖరుని తర్వాత చాలమంది సంస్కృత లాక్షణికులు కవి సమయార్థ నిబంధనంపై ప్రత్యేక శ్రద్ధ వహించినా అందరూ రాజశేఖరుని అడుగుజాడలలో నడచిన వారే. తెలుగు సాహిత్యంలో వెలసిన లక్షణ గ్రంథాలన్నీ సంస్కృతానువాదా లయినందువల్ల ప్రత్యేకంగా కవి సమయాలనుగూర్చి ప్రస్తావించలేదు. కొన్నింటిలో సమయ శబ్ద ప్రసక్తి వున్నా అది కవి సమయ మూలార్థానికి దూరంగా వున్నట్లు తోస్తుంది.

## 2. కవిసమయ లక్షణం

అశాస్త్రీయ మలౌకికం చ పరంపరాయాతం।

యమర్థముపనిబధ్నంతి కవయః స కవిసమయః అని రాజశేఖరుడు. 'అశాస్త్రీయం, అలౌకికం, పరంపరాగతమైన అర్థ నిబంధనం కలది కవిసమయం' అని అర్థం. అర్థ నిబంధనం అనే మాటలో సమాన ఆచరణమనే భావం అందులో ఇమిడివుంది. అశాస్త్రీయం అంటే శాస్త్రతః విహితం కానిది; అలౌకికం అంటే లోకానుభవంలో ఏర్పడనిది; పరంపరాయాతం అంటే పరంపరాగతంగా వస్తూ వున్నదై ఏ అర్థాన్ని కవులు తమ గ్రంథాల్లో అందరూ ఒకే రీతిగా పొందు పరుస్తున్నారో అదే కవిసమయం.

## 2.1 అశాస్త్రీయం :

శాస్త్ర మర్యాదలకు విరుద్ధమైంది అశాస్త్రీయం. శాస్త్ర మర్యాదలకు లొంగివుండే అంశాలను కవులొక వేళ ప్రయోగించినా అవి శాస్త్రాంశాలే అవుతాయికాని కవితాంశాలు కాజాలవు. శాస్త్రాలందు లేని, శాస్త్రాల కందని అంశాలే పండిత పామర హృదయాలను రసార్ద్రి మొనరిస్తుంటాయి. శాస్త్రం తర్కాలకు అధీనం. కవిత్వం హృదయాధీనం. హృదయానికి ఆనందాన్ని కల్గించే వస్తుసముదాయాన్ని కవులు కావ్యాల్లో కల్పించారు. ఈ కల్పనలకి మూలం శాస్త్రాల్లో కాని, లోకంలో కాని వుందా లేదా అనే మీమాంసకు స్వస్తి చెప్పి స్వతంత్రంగా ప్రయోగించారు. వీటిపట్ల ప్రమాణ బుద్ధి కలిగిన సాహిత్యాచార్యులు కూడా మన్నించి అని అనుసరణీయాలేనని ఆదేశించారు. కనుక ఇక్కడ అశాస్త్రీయమని రాజశేఖరుడు సూచించాడు, ఉదా॥కు- కృష్ణ పక్షంలో వెన్నెల లేదనడం; శుక్లపక్షంలో చీకటి లేదనడం.

## 2. 2. అలౌకికం :

లోకరహితమైంది అలౌకికం, పరలోకానికి సంబంధించినటువంటిది. మానవునికి దృష్టి గోచరమైనటి స్థావరజంగమాత్మకమైన ప్రపంచాన లేనట్టిది. కవి హృదయం రసాధీనమైనప్పుడు అతని భావాలు శబ్దాకృతిని దాల్చినప్పుడు ఈ లోకంలో వున్న వాటికంటే విలక్షణమైన, ఊహాతీతమైన రూపాలేర్పడుతాయి. ఈ లోకాన మనకు కన్పించే వస్తువుల్లోలేనివర్ణనలు, వాసనలు, అందాలు చేష్టలు దానిలో భాసిస్తాయి. ఈ విధంగా భావమానమైన వినూత్నావస్థే కవిత్వావిర్భావానికి హేతుభూతాలవుతాయి. ప్రాయికంగా బ్రహ్మ సృష్టిలో ఏదోలోపమున్నట్లు కన్పిస్తుంది. ఆలోపాన్ని తీర్చడానికన్నట్లు మార్పులు చేర్పులు చేసి కవి తన భావుక హృదయాన్ని ఆవిష్కరిస్తాడు. ఈ మార్పులు ఊహాప్రపంచంనుండి గ్రహించి ఆనందజగత్తును సృష్టింపజేస్తాయి. ఉపమాద్యలంకారాలు ఈ యథార్థాన్నే సూచిస్తున్నాయి.

ఉదా॥కు- నదుల్లో పద్మోత్పలాలు, జలాశయాల్లో హంససారసాలు లేకున్నా వున్నట్లు వర్ణించడం.

## 2,3 పరంపరాగతం

కవి సమయ నిర్వచన సూత్రానికి 'పరంపరాయాతం' అనే శబ్దం ప్రాణం వంటిది. కారణం, అశాస్త్రీయం, అలౌకికం అయినంత మాత్రాన ఏ వర్ణనాంశం కవిసమయ మనిపించుకోదు, అది పారంపర్యంగా సంప్రదాయ బద్ధంగా కవిప్రయుక్తం కావలసివుంటుంది. రాజశేఖరుడు మరోచోట దేశభేదం చేత వస్తు రూప గుణాల్లో వ్యత్యాసం కన్పించినా ఆ వ్యత్యాసాలను పాటింపక సమయసిద్ధమైన రూపాన్నే ప్రమాణంగా గ్రహింపవలసి వుంటుందని తెలియజేశాడు. అందువల్ల కావ్యరచనల్లో ఏకరూపతను సమత్వాన్ని రక్షించడమే కవిసమయ లక్ష్యమని తెలుస్తూవుంది.

ఉదా॥కు కీర్త్యపకీర్తులను ధవళ నీలాలుగా వర్ణించడం.

### 3. కవిసమయ ప్రవృత్తులు

అసతోఽపి నిబంధేనా నిబంధేన సతోఽపిచ ।
నియమేన చ జాత్యాదే కవీనాం సమయస్త్రిధా ॥

అని కవిసమయ ప్రముఖ ప్రవృత్తులను రాజశేఖరుడు తెలియజేశాడు. 1. అసత్ నిబంధనం- లేని దానిని నిబంధించడం, 2. సత్ అనిబంధనం ఉన్న దానిని నిబంధింపక పోవడం, 3. నియమ నిబంధనం- నియతంగా కొన్నిటిని కొన్నిచోట్ల నిబంధించడం అనే మూడు ముఖ్యమైన ప్రవృత్తులు కవిసమయ వింగడింపు వల్ల తెలుస్తుంది. అసత్తు, సత్తులను శాస్త్రం అంగీకరింపదు. ఇక నియమం పరంపరాగతంగా కవులు తీసుకొన్నవే కాని లోకం లోను, శాస్త్రాల్లోను వాటికి చెల్లుబడిలేదు. కనుక ఈ మూడింటినే ప్రధానంగా పేర్కొనడం జరిగింది. ఈ మూడు ముఖ్య ప్రవృత్తులు తిరిగి జాతి- ద్రవ్య- గుణ- క్రియాది ఉప ప్రవృత్తుల విభజనం క్రింద పరిశీలింపబడినవి. ఈ మొత్తం కవి సమయాలు స్వర్గ- భౌమ- పాతాళ సంబంధమైనవిగా విభజించి వాటి వాటి లక్షణాలు తెలియజేయ బడినాయి.

### 3. 1 అసత్ నిబంధనం

కేవలం సత్యాన్నే నిరూపించడం కవిత్వాశయం కాదు. ఆ విధంగా చెప్పడం శాస్త్రమర్యాదఅవుతుంది. అందువల్ల కవి సౌందర్య సమగ్రతను సాధించటానికి ఈ లోకంలో లేని వస్తువులను కల్పించుకొని వాటికి గుణదోషాలను ఆపాదించుకొని తనదైన ఒక నూతన సృష్టికి మూలపురుషుడవుతాడు. ఈ అసత్ నిబంధనంలో వస్తువుల అప్రకృత రూపం తెలియజేయబడుతుంది. దీనితో వర్ణ్యవస్తువు ధర్మాన్ని చెప్పడంజరుగుతుంది.

ఉదా॥కు పద్మాలు నదుల్లోనూ, సముద్రాల్లోనూ కలవని చెప్పడం, వెన్నెలను చేతులతోపట్టి త్రాగునట్లు వర్ణించడం, కీర్త్యపకీర్తులకు ధవళ నీలాలు ఆపాదించడం, చకోరపక్షులు వెన్నెలనుత్రాగి జీవించునని వర్ణించడం మొదలైనవి.

### 3.2. సత్ అనిబంధనం :

కల్పనాధీనమైన కవితా ప్రపంచంలో సౌందర్య దృష్టికోసం పదార్థాల్లో లేని గుణాలను ఆపాదించడానికి కవిప్రయత్నిస్తాడు. అదేవిధంగా సౌందర్యదృష్టికి సంబంధాలుగా తోచే వాస్తవికాంశాలేవైనా వుంటే నిరాకరించడానికి కూడా సందేహింపడు. ఈప్రయత్నంలో ఎన్నో సత్యాంశాలు మరుగునపడి అప్రధానాలవుతూ వుంటాయి. కొన్ని యదార్థాంశాలు రసహీనంగా వుండొచ్చు. కాన అట్లాంటివాటిని గ్రహించడంలో కవులు నిగ్రహాన్ని ప్రదర్శించారు. ఈ నిగ్రహ ప్రదర్శనమే సత్ అనిబంధనం. వస్తువుయొక్క ప్రకృత ధర్మాన్ని స్వీకరింపకపోవడం ఈ అర్థనిబంధనంలో జరుగుతుంది. దీనిలో వర్ణ్యవస్తువు పరిష్కరింపబడుతుంది.

ఉదా॥కు- చందన వృక్షాలకు పూలుపండ్లు లేవనడం, కృష్ణపక్షంలో వెన్నెల లేదని; శుక్లపక్షంలో చీకటిలేదని వర్ణించడం, కుందకుట్మలాలకు రక్తిమ లేదనడం. శేఫాలికాలతలకు పుష్పపతనం సూర్యోదయానంతరం కూడా వున్నట్లు వర్ణించడం మొదలైనవి.

### 3 3. నియమ నిబంధనం :

యదార్థస్థితి ఏ విధంగా వున్నా ఒక కట్టుబాటుకు లొంగి చెప్పడం నియమం. అదిదాటితే అనర్థ మేర్పడుతుంది. కవులు చేసుకొన్న నియమాలన్నీ ప్రాయికంగా పాఠక లోకానికి బాధ కల్గకుండా చేసుకొన్నవేకాని కేవలం అబద్ధాలను వాడుకలోకి తేవడానికి కాదు. కవి సమయాలుగా నిలిచిపోయిన నియమాలు సత్యాసత్యాల మాట ఎటున్నా వాటిలో అనేకం సామెతలుగా లోకోక్తులుగా భాషలో నిలిచి పోయినాయి. ఒక వస్తువు అనేక చోట్ల

వున్నా ఏకత్ర నియమనం చేయడం నియమ నిబంధనంలో ప్రధానం దీనిలో వర్ణ్య వస్తువు సమాహారం చెప్పబడుతుంది.

ఉదా॥కు సముద్రాల్లోనే మొసళ్ళ స్థితిని తెలియజేయడం, హిమాలయాల్లోనే భూర్జవృక్షాల స్థితినితెల్పడం, అన్ని ఋతువుల్లోను మేఘాలు నల్లగావుండునని చెప్పడం, క్షీర-క్షార సాగరాలకు అభేదాన్ని పాటించడం మొదలైనవి.

ఈ విధంగా కవిసమయాలు లక్ష్య లక్షణ సమన్వితాలై కావ్య సౌందర్య హేతువులుగా సాహిత్యంలో స్థిరపడి పోయినాయి. వీటిని పరిహరించి కావ్యసృష్టి చేయలేము. సాహిత్యంలో చాలా అలంకారాలు కవి సమయగతాలై వుంటాయి, అందుకే కవి సమయాలు కవిత్వానికి ప్రాణప్రదమైనవని ఆలంకారికుల అభిప్రాయం.

ఆధారగ్రంథాలు :

1. కావ్య మీమాంస (సం)-రాజశేఖరుడు
2. తెలుగు సాహిత్యములో కవి సమయములు- (సిద్ధాంత గ్రంథం) డా॥ జి. శంకరరెడ్డి
3. కవి సమయములు- డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి
4. కవి సమయమీమాంస (హిందీ)- విష్ణుస్వరూప్
5. Convention and Revolt in poetry- J.L. Lowes

డా॥ జి. శంకరరెడ్డి
పరిశోధక విద్యార్థి,
తెలుగు అధ్యయన శాఖ,
ఎస్వీ యూనివర్శిటీ,
తిరుపతి-2

# భాస్కరాచార్యులు

భరతావనిలో జన్మించిన భగోళశాస్త్ర పారంగతులు, గణితశాస్త్ర వేత్తలలో భాస్కరాచార్యులు మొదట లెక్కింపదగినవారు. చారిత్రకాధారంగా ఒకటవ ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు, మొదటి భాస్కరుడు, రెండవ ఆర్యభట్టు, శ్రీపతి, రెండవ భాస్కరుడు, (ఈయననే మనం భాస్కరాచార్యులని పిలుస్తాం) మాధవుడు, పరమేశ్వరుడు, నీలకంఠుడు మొదలైనవారు ప్రాచీన భారతదేశమున భగోళగణితశాస్త్రవేత్తలని ప్రతీతి. వీరందరూ వేరు వేరు ప్రాంతాలలో భిన్న భిన్న కాలంలో మన పవిత్ర భరతావనిలో వెలుగొంది యున్నారు.

భాస్కరాచార్యులు, భారతీయ జ్యోతిష్యశాస్త్రంతో మంచి పేరు ప్రఖ్యాతి నార్జించిన వారు. ఈయనకు పూర్వం సౌర, ఆర్య, బ్రహ్మ, అనే మూడు సిద్ధాంతాలు వ్యాప్తిలో నుండెడివి కానీ మన దేశమున ఎందరో భగోళ పండితులున్ననూ, వారిలో భాస్కరాచార్యులు, అద్వితీయుడని చెప్పక తప్పదు. ఆయన సమకాలీన కాలంలో గొప్ప సన్మానాల నందడమే కాక భారతదేశ మంతటా మారుమూలల గూడా ఈయన వ్రాసిన గ్రంథాలు అమితశ్రద్ధతో పఠించడం జరిగింది— నేటికిని జరుగుతూ ఉంది.

భాస్కరాచార్యులకు బ్రహ్మగుప్తుడు ప్రేరణకర్త ఆదర్శప్రాయుడని చెప్పక తప్పదు. తన "సిద్ధాంత శిరోమణి"లో ప్రప్రథమమే బ్రహ్మగుప్తుని యందు, అపారమైన శ్రద్ధాభక్తులు చూపించడం జరిగింది. అంతేకాదు తనకు కావలసిన చాలా ఉపయోగకరమైన విషయాలను బ్రహ్మగుప్తుని గ్రంథాలనుండి ఆ విషయాలను బాగా అధ్యయనం, మననము, చింతనము, వివేచన, విశ్లేషణ చేసి తన గ్రంథాలలో చోటు కలిపించాడు, బ్రహ్మగుప్తుని గ్రంథాలు చివరికి

అదృశ్యమై పోయాయి. "గురువు బెల్లమై పోయాడు శిష్యుడు చెక్కెరై పోయాడు" అదీవింత !

భాస్కరాచార్య స్వలిఖితానుసారం ఆయన జన్మ శకసంవత్సరం 1036కు సరియగు క్రీ.శ.1114 సం॥ అని నిర్ధారించడం జరిగింది. ఆయన, తన 36 సం॥ ప్రాయముననే ఉపయుక్తమైన గ్రంధ రచనచేశాడు. ఆయన ద్వితీయగ్రంథం "కారణకౌతూహలం" 69 ఏండ్ల ప్రాయంలో రచించాడు. ఇంత దీర్ఘకాలంవిషయ సేకరణచేసి పరిశోధించి వినూత్న అంశాలను జోడించడం జరిగింది.

"సిద్ధాంత శిరోమణి" నాలుగు భాగాలు (1) పాటి గణితము (లీలావతి గణితము) (2) బీజ గణితము (3) గృహగణితము (4) గోళాధ్యాయనము. ఈ గోళాధ్యయనములో ఆయన కుటుంబీకుల గూర్చిన విషయాలు ఉల్లేఖింపబడినవి. శాస్త్రపారంగతుడు, శాండిల్య గోత్రజుడు "మహేశ్వరుడు" ఆయనతండ్రి. "సహాయ" పర్వత సమీపమందలి "బిజ్జడవిడా" అనే పేరుగల గ్రామం ఆయన నివాసస్థానమని చెప్తుతారు. అదినేడు పైఠన్ (ప్రతిష్ఠానపురం) సమీపమున ఉన్నట్లు తెలుస్తుంది.

ఈ భాస్కరాచార్య విరచితమైన గ్రంథాన్ని (ముఖ్యంగా లీలావతి భాగాన్ని) అక్బర్ చక్రవర్తి ఆదేశానుసారం పారసీ భాషలోనికి క్రీ.శ. 1577లో అనువదించడం జరిగింది. ఆ గ్రంథములో ఆయన మూలస్థానం "బీదర్" అని చెప్పబడింది. కాని అది "సహాయ" పర్వత సమీపాన లేదు. ఈ విషయమై ఇంకా పరిశోధన చెయ్యవలసిన అవసరం ఉంది.

ఒకే ఒక గ్రంథంలోని భాగం పేరు "లీలావతి" అని పేరిడడం చాలా విచిత్రంగా ఉంది కదూ! ఈవిషయమై పుక్కిటి పురాణాలు చాలా ప్రచారంలో ఉన్నాయి, లీలావతి ఆయన కుమార్తె యని, ఆమె పేరనే ఈ గ్రంథం వ్రాశాడని అంటారు.

దానిలో అంకగణితము, జ్యామితి (రేఖాగణిత) ఉల్లేఖింపబడి దానిపై చాలా భాష్యాలు గూడా వ్రాయబడ్డాయి. వాటిల్లో దాదాపు 20 భాష్యాలు ప్రచురణకి నోచుకున్నాయి, వాస్తవానికి లీలావతి గణితం శాస్త్రానికి తలమానికమని చెప్పక తప్పదు. ఈ శాస్త్రాన్ని శ్రద్ధగా అధ్యయనం చేస్తే వృక్షానికున్న ఆకులు గూడా లెక్కించవచ్చు.

దీనిలోని బీజగణితానువాదం గూడా క్రీ.శ. 1635 లో పారసీ భాష లోనికి అనువదించడం జరిగింది. నేటి వర్తమాన కాలంలో డా. హెచ్. టి కౌల్ బ్రుక్ అనునతడు ఈ బీజగణితమును, లీలావతి గణితమును ఆంగ్లభాషలోనికి అనువదించడం జరిగింది.

కుమారి లీలావతిని గూర్చిన ఈ గాథ గూడా చాలా వ్యాప్తిలో ఉంది. భాస్కరాచార్యులు జ్యోతిష శాస్త్రంలో మంచి పాండిత్యం సంపాదించడంతో, తన పుత్రిక లీలావతి జాతక చక్రం చూచి, ఆజన్మాంతరం అవివాహితగా ఉండవలసి వస్తుందని తెలుసుకొన్నవారై, తన సంపూర్ణ జ్ఞానాన్ని వినియోగించి మంచి ముహూర్తం నిర్ణయించి, వివాహం చెయ్యాలని నిర్ణయించు కుంటాడు. తన ప్రాణప్రదమైన పుత్రిక వివాహనిమిత్తం అన్ని ఏర్పాట్లు చేస్తాడు. వివాహ సుదినం రోజు ఒక జలగంటను (నీటి గడియారం) ఏర్పాటు చేస్తాడు. బాలిక లీలావతి గూడా తన దౌర్భాగ్యానికి ఇంతవరకు చింతించుతూ ఉంటూ ఇప్పుడు తన భాగ్యానికి సంతోషించుతూ శుభగడియ కొరకు నిరీక్షించుతూ మరీ మరీ ఆ నీటి గడియారం వైపు పరుగులు తీసి ఆతురతతో తొంగిచూడడం చేస్తూఉంటుంది. ఈ ఉరుకు పరుగులతో ఆవిడ మెడలోని, ముత్యాల కంఠహారం తెగినీటి గడియారంలో పడటం—అందులో ఒక ముత్యపుపూస నీటిధారకి అడ్డుపడుతుంది. పెళ్ళిముహూర్తం శుభగడియలు ఎప్పుడైనవి తెలుసుకోలేకపోవటం జరుగుతుంది. చివరకు ఆమెకు పెళ్లి నిలిచిపోతుంది. అటువంటిఅభాగ్య

రాలి దీనస్థితిని చూస్తే ఏ తండ్రికైనా కరుణ కలుగుతుంది కదా? అలాంటి అజన్మ బ్రహ్మచారిని, ఆయన ఎంతగానో ఓదార్చుతాడు. చివరికి ఆమె పేరు శాశ్వతంగా ఈ ప్రపంచంలో నిలిచి పొయ్యేదానికి, లీలావతీ పేరనే గణితం రచిస్తాడు. మరికొందరంటారు లీలావతి భాస్కరాచార్యుల భార్యయని, ఈ లీలావతి పేరు సామాన్యంగా కల్పిత నామమని చెప్పకోవచ్చు. భాస్కరాచార్యులు పెద్దకవి కనుక లీలావతీ అనే పేరును కల్పించి ఉండవచ్చునని, చాలామంది అభిప్రాయం. ఆయనకు ఏ పేరు నచ్చిందో అ పేరనే పద్యాలలో గ్రంథరచన చేశాడు. లీలావతి ఆయన మానస పుత్రియే కాని శారీరక పుత్రి, కానేరదని పండితులు అభిప్రాయపడుతున్నారు.

ఈ లీలావతీ గణితమందు, కూడిక, శేషం, హెచ్చింపు, భాగహారము, ఘనము వర్గమూలము, ఘనమూలము, మొదలైన గణితశాస్త్ర విషయాలను వివరించడం జరిగింది. తరువాత "౦" (సున్న) స్థానమును ప్రయోగించే విధానమును తెలియ పరచడం జరిగింది. బీజగణితము, జ్యామితి (రేఖాగణితము) రంగాలలో వచ్చేటటువంటి చాలా విషయాలను, కూలంకషంగా చర్చించటం, జరిగింది. ఆ గ్రంథములో వర్గ సమీకరణాలు, క్షేత్ర ఫలాలు ,త్రికోణమితి, మొదలైన విషయాలను, తొలుదొల్త గణిత పండితుల విధులను, సులభ సరళిలో సాధించేదానికి ఏర్పాట్లు నిర్దేశించడం జరిగింది. భాస్కరాచార్యులు ఖగోళశాస్త్రోపాధ్యాయుల నిమిత్తమై, సౌర మండలము గ్రహాల నక్షత్రాల నమూనాలను, ఎట్లా తయారు చెయ్యాలో వాటి విధులను, విపులంగా మరో అధ్యాయంలో వివరించడం జరిగింది. విభిన్న అక్షాంశాల్లో విభిన్న సమయాల్లో వేరు వేరు ఋతువుల్లో రాత్రి పగలు, కాలనిర్ణయం, సూర్యోదయ కాలం, ఒక ప్రదేశం యొక్క అక్షాంశాన్ని నిర్ణయించడం, తెలుసుకోవడం ఇత్యాది విషయాలను తెలియచేయడం జరిగింది. సూర్యగ్రహణము, చంద్రగ్రహణాలపై మూడు అధ్యాయాలు సంపూర్ణంగా వివరించటం జరిగింది.

భాస్కరాచార్యులు ఒక అధ్యాయం పేరు "యంత్రాధ్యాయము" అనిపేరిడి దానితో అంతరిక్షంలోని గ్రహాలగూర్చి అధ్యయనం చేసేదానికి కావలసిన పనిముట్లను గూర్చి చర్చించడం జరిగింది.

ఎ. రామసుబ్బారెడ్డి
UGC, SRF, తెలుగు
ఎస్. వి. యూనివర్సిటీ,
తిరుపతి-2




## సాహితీ మంజూష

(వ్యాస సంకలనం)

రచన-శ్రీమతి పుట్టపర్తి నాగపద్మినీదేవి

వెల రూ. 8-00

ప్రతులకు-ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైద్రాబాదు-500 001

పండిత వంశంలో జన్మించి, సంస్కృతాంధ్ర భాషలూ, ఆంగ్ల ప్రాకృత కన్నడ హిందీభాషలూ క్షుణ్ణంగా అభ్యసించి సాహిత్యకృషి సాగిస్తున్న విదుషీమణి శ్రీమతి నాగపద్మినీదేవి. మహాకవి, సరస్వతీపుత్ర శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులుగారి ప్రియపుత్రిక అయిన ఈ రచయిత్రి తండ్రిగారి సంస్కారాన్నీ, సంప్రదాయాన్నీ పుణికి పుచ్చుకుని చక్కగా రచనా వ్యాసంగం చేయడం అబ్బురపడవలసిన అంశంకాదుకదా !

ఈ సంకలనంలో గణాధిపతి, బసవేశ్వరుడు-వీరశైవము, చందమామను సంభావించిన చందాలు, రచనా త్రివిక్రముడు ప్రేమచంద్, హేమంతసీమంతినీవిలాసం, కథాసాహిత్యం-ఒక పరిశీలన, గాథాసప్తశతిలో సామాజిక స్పృహ, కవిచాతకం అనే ఎనిమిది వ్యాసాలున్నాయి ప్రతివ్యాసంలోనూ రచయిత్రి పరిశీలనాదృష్టినీ, ప్రతిభా సంపదనూ గమనించగలం.

'గణాధిపతి' అనే వ్యాసం గణపతి స్వరూపస్వభావాలను చక్కగా వ్యక్తపరుస్తున్నది. 'బసవేశ్వరుడు-వీరశైవము' అనేవ్యాసంలో పద్మినీదేవిగారి విమర్శనాపాటవమూ, కన్నడ వాఙ్మయ పరిచయమూ వెల్లడౌతున్నాయి. ఇది ఒక మంచివ్యాసమని తిరుమల రామచంద్రరావుగారు వక్కాణించినది యథార్థం. చందమామ అందచందాలను ప్రకటించడంలోనూ, హేమంత సీమంతినీ విలాసాన్ని ప్రదర్శించడంలోనూ రచయిత్రి బహుగ్రంథ పరిశీలననూ, ప్రజ్ఞావిశేషాన్నీ చూపించారు. 'రచనా త్రివిక్రముడు— ప్రేమ్‌చంద్' అనే వ్యాసం ప్రేమచంద్ సాహితీమూర్తిని సాక్షాత్కరింపజేస్తున్నది. కథాసాహిత్య మనే వ్యాసం కథాసాహిత్యాన్ని విశ్లేషించి వివరించినప్పటికీ సామంజస్యానికి దూరమైందేమో అనిపిస్తుంది, ఎందుకంటే ఈ వ్యాసంలో కేవలం స్త్రీల కథలనే పరామర్శించడం జరిగింది కాబట్టి.

'గాథాసప్తశతిలో సామాజిక స్పృహ' అనే వ్యాసం శ్రీమతి పద్మినీ దేవిగారి ప్రాకృత సాహితీ పరిశీలనకు గీటురాయిగా వున్నది ఇందులో ప్రాకృత గాథలను ఉదహరించి ఆనాటి సామాజిక స్థితిగతులనూ ప్రాకృత కవుల కవితా సౌందర్యాన్నీ కళ్ళకు గట్టించారు రచయిత్రి.

'కవి చాతకం' దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి కవితా వైభవాన్ని విశదం చేస్తున్నది. ఈ విధంగా రమణీయమైన వ్యాసరత్నాలను సమకూర్చిన 'సాహితీ మంజూష' అందించిన శ్రీమతి నాగపద్మినీ దేవిగారు అభినందనీయులు.

వేముగంటి

# వార్తావాహిని

## కంప్యూటర్: భాషా విజ్ఞానము

8-12-1986 బుధవారం ఉదయం 11-00 గం. లకు పోస్టు గ్రాడ్యుయేట్ అండ్ రీసెర్చి సెంటరు, దక్షిణ భారత హిందీ ప్రచార సభలో మెక్సికో ఎల్ కలిగియో విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ రావుల్ అవీలా భాషా విజ్ఞాన క్షేత్రంలో కంప్యూటర్ అనే విషయం మీద ఉపన్యసించారు. సెంటరు రిజిష్ట్రారు శ్రీ ఆంజనేయశర్మ అధ్యక్షత వహించారు. శ్రీ అవీలా తమ ఉపన్యాసంలో భారతీయ భాషలైన హిందీ తెలుగు భాషలలో హిందీ ప్రసభ పక్షాన కంప్యూటర్ కార్యక్రమం ప్రారంభమైనందుకు తమ సంతోషాన్ని వెలిబుచ్చారు ఉపన్యాసానికి ముందు కేంద్రంలో జరుగుతున్న కంప్యూటర్ కార్యకలాపాలను తిలకించారు. కంప్యూటర్ సహాయంతో పాఠ్యపుస్తకాలను తయారు చేయడం గురించి వివరంగా మాట్లాడారు. ప్రపంచంలోని అన్ని భాషలకూ ఒక లిపి ఏర్పడితే చాలా బాగా ఉంటుందని చెపుతూ చైనాలో పని చేస్తున్నపుడు తనకు కలిగిన అనుభవాన్ని వివరించారు. రోమన్ లిపిని గురించి మాట్లాడుతూ ఇంగ్లీషు, ఫ్రెంచ్ భాషల మూలంగా రోమన్ లిపి క్లిష్టమనే భావం విశ్వంలో వ్యాపించిందనీ దీనిని మరచి స్పానిష్‌వంటి ఇటాలియన్ భాషల దృష్టిలో చూడవలసి వుంటుందని అన్నారు. వివిధ భాషా రంగాలలో కంప్యూటర్ వలన సాధించగలిగిన ఫలితాలను వివరించారు. ప్రొఫెసర్ రావల్ గారు స్వాగతం చెప్పారు. శ్రీ రవీంద్ర శర్మ ధన్యవాదంలతో సమావేశం పూర్తి అయినది.

## హిందీ మీడియం డిగ్రీ కాలేజీ, విజయవాడ

## వ్యవహారిక హిందీ కావాలి

ది.27-11-86న పి జి.కాంప్లెక్సు, ద.భా. హిందీ ప్రచారసభ హైదరాబాదు రిజిష్ట్రారు శ్రీ వేమూరి ఆంజనేయశర్మ హిందీ మీడియం డిగ్రీకాలేజీ, విజయవాడను సందర్శించారు. శర్మగారు తమఉపన్యాసంలో మారుతున్న పరిస్థితుల దృష్ట్యా యీనాడు రాజ భాషా శిక్షణలో చాల మార్పులు రావాలి. మనమే మన దేశాన్ని పాలించుకుంటున్నాం, టెలివిజన్, రేడియో, వీడియోలు భాషా ప్రచారానికి, జాతీయ సమైక్యతకు తోడ్పడుతున్నాయి. ఇంతవరకు మనం హిందీ భాషా ప్రచారం చేస్తున్నాం. ముందు కూడా చేస్తాం. అది ఒక భాగం. రెండవ భాగంలో వ్యావహారిక హిందీ శిక్షణ అవసరమై వుంది. ఇందుకు మనం ప్రణాళికలు వేసుకోవాలి. ఉదాహరణకు బ్యాంకులలో కావలసిన హిందీ వేరుగా వుంటుంది. రైల్వేలో కావలసిన హిందీ మరొక విధంగా ఉంటుంది. న్యాయశాఖలో ఇంకొక విధంగా ఉంటుంది వీటన్నింటిలో తగిన శిక్షణ ఇవ్వాలి. అందుకు ప్రాతిపదికగా హిందీ మీడియం డిగ్రీ కళాశాల స్థాపించి హిందీలో ఉత్తరాది వారితో పోటీ పడినపుడు తగిన సామర్థ్యం కలిగించి తద్వారా వివిధ పరిపాలనా శాఖలకు అనువైన శిక్షణ ఇచ్చుటయే మా ప్రధాన ఉద్దేశ్యము. కంప్యూటర్ ట్రైనింగ్ హైదరాబాదులో ఏర్పాటు చేశాము. అనువాదము, వ్యావహారిక హిందీకి కూడా శిక్షణ ఇస్తున్నాం. భవి

వృత్తులో విజయవాడలో అనువాదము, బియడ్ శిక్షణ ఇవ్వబోతున్నాం అని చెప్పారు.

సభలో సర్వశ్రీ కార్యదర్శి రామస్వామి గారు, కార్యకర్త వెంకటేశ్వరరావు గారు, వ్యవస్థాపకులు పాల్గొన్నారు. తొలుత అతిథులకు ప్రిన్సిపాలు సుబ్బారావు గారు స్వాగతం చెప్పారు.

## హిందీ ప్రేమీమండలి, తెనాలి

ది 28. 11. 86 ఉదయం తెనాలి హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయంలో హిందీ టంకణ విద్యాలయ సత్రాంతోత్సవం జరిగింది. ఈ ఉత్సవానికి దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర కార్యదర్శి శ్రీ అన్నదానం రామస్వామి అధ్యక్షత వహించారు. కుమారి వి. పద్మజ, శ్రీమతి ఎన్. రోహిణి గార్ల ప్రార్థన గీతంతో సభ ప్రారంభమైంది. మండలి వ్యవస్థాపకులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావు స్వాగతం పలికారు ముఖ్య అతిథులు శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ, రామస్వామి గార్లను పుష్పమాలాలంకృతులను గావించి, ఆంధ్రసభ స్వర్ణజయంతి రూ 116/-లు బహుకరిస్తూ నిధి సన్మానం గావించారు.

ఉచ్చ శిక్షా శోధ సంస్థాన్ రిజిష్ట్రార్ శ్రీ ఆంజనేయశర్మ విద్యార్థులకు వీడ్కోలు సందేశమిస్తూ— "మారుతున్న పరిస్థితుల దృష్ట్యా విద్యార్థులు హిందీ టైప్‌రైటింగ్‌తో పాటు కంప్యూటర్ వంటి సాంకేతిక కోర్సులు నేర్చుకోవాలన్నారు. విశారద-లేక ప్రవీణతో పాటు 10వ తరగతి పాసయిన వారు, సభవారు ప్రారంభిస్తున్న ఇంటర్ మీడియట్, బి. ఎ. తరగతుల్లో విరివిగా చేరి లాభం పొందవలసినదిగా కోరుతూ విద్యార్థులను ఆశీర్వదించారు.

హిందీ టంకణ పరీక్షల్లో ఉత్తీర్ణులైన వారికి విజయ పత్రాలను అందజేశారు.

శ్రీ ఎ. రామస్వామి గారు తమ అధ్యక్షోపన్యాసంలో హిందీ ప్రేమీ మండలి ప్రగతిని, మహా విద్యాలయ విద్యార్థుల ఉత్సాహాన్ని ప్రశంసిస్తూ, హిందీ మాధ్యమంగా బి. ఎ. పూర్తి చేసి బి ఇడి శిక్షణ పొంది సమావర్తనోత్సవం జరుపుకొనగలరని ఆశిస్తున్నట్టు హర్ష ధ్వానాలమధ్య తెలియ జేశారు.

తొలుత జాతీయ పతాక వందనం, అల్పాహార విందు గావించబడినది.

విద్యార్థి నాయకుడు శ్రీ ఈమని శ్రీధర్ ధన్యవాదాలు తెలిపారు.

## సాయంత్రం గం॥ 4 30 ని॥ లకు మండలి ప్రత్యేక సమావేశము

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ, రామస్వామి గార్ల రాకను పురస్కరించుకొని మండలి ప్రత్యేక సమావేశం జరిగింది.

అందు హిందీ ప్రేమీ మండలి కార్యవర్గ సభ్యులు పుర ప్రముఖులు, హిందీ ప్రచారకులు, అభిమానులు, పత్రికా విలేకర్లు కూడా పాల్గొన్నారు. ఈ సమావేశానికి స్వాతంత్ర్య సమరయోధులు, మండలి అధ్యక్షులు శ్రీ వెలువోలు సీతారామయ్య గారు అధ్యక్షత వహించారు. మండలి కార్యదర్శి సభికులకు స్వాగతం పలికి శ్రీ ఆంజనేయశర్మ, రామస్వామి గార్లను పరిచయం గావించారు. శ్రీ శర్మగారు ఉచ్చ శిక్షా ఔర్ శోధ సంస్థాన్ కార్యకలాపాలను గురించి విపులంగా వివరించారు. వారు తమ ప్రసంగంలో "ప్రచారక" విద్యాలయం లేకపోయినా తెనాలిలో హిందీ ప్రచారోద్ధృతిని, విద్యార్థుల, అభిమానుల హిందీ భాషాభిమానాన్ని తొలుత ప్రశంసించారు. తమ ప్రసంగం కొనసాగిస్తూ- జాతీయ ఉద్యమంలో భాగంగా స్థాపించబడిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ 1964 లో జాతీయ ప్రాముఖ్యం గల సంస్థగా గుర్తింపబడి విశ్వవిద్యాలయ స్థాయి పరీక్షలు బి.ఏ., ఎమ్.ఏ.,

ఎం ఫిల్., పి.హెచ్.డి. పరీక్షలను జరిపించుచున్న దన్నారు. మన రాష్ట్ర ప్రభుత్వ భాషా విధానం వల్ల ఏర్పడిన అలజడిని పేర్కొని ఈ ఒడుదుడుకుల మధ్య నుంచి ముందుకు సాగిపోవలసిన తరుణమాసన్నమైందని అన్నారు. అందుకు గాను 10-15 హిందీ మీడియం డిగ్రీ కాలేజీలు ప్రారంభించనున్నట్లు చెప్పారు. నేటి దేశ పరిస్థితులకు అనుగుణంగా బ్యాంకులు, పరిశ్రమలు మొదలగు వానిలో ఉపాధికి ఉపకరించే ఫంక్షనల్ హిందీ సిలబస్‌లను రూపొందించడం జరుగుతున్నదని. ప్రస్తుతం విజయవాడలో మాదిరి హిందీ డిగ్రీ కాలేజి తెనాలిలో హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయంలో కూడా ఏర్పాటు ప్రతిపాదన పరిశీలిస్తున్నామని అన్నారు. హిందీ మీడియంలో బి ఇడి. కళాశాలలు మద్రాసు, హైదరాబాదు, బెంగుళూరు ధార్వాడ్, ఎర్నాకుళంలో నడచుచున్నదని, ఇంకా మరికొన్నిటిని ప్రారంభించ దలచినట్లు ఆయన తెల్పారు. ఫంక్షనల్ హిందీ ప్రాతిపదికగా ఎం ఏ. ఎం.ఫిల్. కోర్సులు హైదరాబాదు లోని పి జి. కాంప్లెక్సులో బోధించబడుచున్నవని, నవోదయ పాఠశాలల్లోను కేంద్రీయ విద్యాలయాలలోను హిందీ కంప్యూటర్లను ప్రవేశపెట్టవలసి ఉందని అన్నారు. రూ. 17 లక్షల గ్రాంటుతో తమ సంస్థతో ద్విభాషా కంప్యూటర్లు అమర్చినట్లు చెపుతూ మన సాంకేతిక నిపుణులు 6 భాషలతో కూడిన ఒకే కీ బోర్డుతో ఒక కంప్యూటర్‌ను రూపొందించినట్లు పేర్కొన్నారు. ఇందువల్ల ఒక భాషను మరొక భాష లిపిలో రాయడానికి అవకాశం ఏర్పడుతున్నదని, భాషాంతరీకరణ కూడా యీ కంప్యూటర్ ద్వారా జరగగలదని అంటూ మన సాంకేతిక నిపుణులను అభినందించారు.

మన రాష్ట్ర ప్రభుత్వం 6-7 తరగతుల్లో హిందీని తొలగించడం పట్ల విచారం వ్యక్తపరుస్తూ 8వ తరగతి నుంచి ప్రారంభమయ్యే హిందీకి సిలబస్ రూపొందించ లేదని ఆయన స్పష్టపరిచారు

ధన్యవాద సమర్పణతో సమావేశం ముగిసింది,

## విజయలక్ష్మి మహా విద్యాలయం మరొక బ్రాంచి ప్రారంభం

2-11-86 వ తేదీన తాడేపల్లిగూడెం నందు శారదా గ్రంథాలయములో విజయలక్ష్మి హిందీ మహా విద్యాలయము యొక్క మరియొక బ్రాంచి (ఇంతకు పూర్వం ఒక బ్రాంచి కలదు) మాజీ మునిసిపల్ చైర్మన్ గారైన యీలి వెంకట సత్యనారాయణగారిచే ప్రారంభోత్సవము చేయబడెను తదనంతరము 'సారే జహాసే అచ్ఛా' అనే జాతీయగీతముతో సభ ప్రారంభించబడెను. ఈ సభకు (రిటైర్డు) తహసిల్‌దారు జి. వీరన్న గారు అధ్యక్ష పదవిని అలంకరించిరి. జడ్. పి.హెచ్. స్కూలు ప్రధానోపాధ్యాయులు (జాతీయ అవార్డు గ్రహీత) ముఖ్య అతిథులుగా పాల్గొనిరి. ప్రిన్సిపాల్ &కరస్పాండెంటు అయిన తోటవిజయలక్ష్మి గారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షులు మరియు భారత ప్రధాని అయిన రాజీవ్‌గాంధీ గారు హంతకుల బారి నుండి తప్పించుకొనుట అదృష్టమని వివరించుచూ "రాష్ట్ర భాషా కే బినా రాష్ట్ర గూంగా హై" (జాతీయభాష లేనిచో దేశము మూగపోవును,) అని జాతిపిత చెప్పినది జ్ఞాపకము చేయుచూ హిందీ భాష యొక్క ఆవశ్యకత వివరించి ఈ ఉచిత హిందీ శిక్షణను అందరూ సద్వినియోగ పరచుకొనవలసినదిగా కోరియున్నారు. వచ్చిన వారికి వందన సమర్పణతో సభ ముగిసింది.

KARNATAK UNIVERSITY DHARWAD

No. Ku/Aca/Crt/Recog/86-87/412 Date : 10-12-1986

NOTIFICATOIN

Sub :- Recognition of B.Ed. examination in Hindi conducted by Dakshina Bharat Hindi Prachar Sabha, Madras regarding.

Ref :- V. C.'s orders dated 6-12-1986.

With reference to the subject mentioned above it is hereby informed that the B Ed. examination conducted by Dakshina Bharat Hindi Prachar Sabha, Madras, is recognised as equivalent to B.Ed. of Karnatak University, provided the candidate has studied English at Bachelors degree level of a recognised University.

Sd/-.............
REGISTER

Copy f. w. cs. to-

1) The Chairman, Post-graduate Education Department, K.U. Dharwad.
2) Director, Dakshin Bharat Hindi Prachar Sabha, Madras.
3) Personal Secretary to Vice-Chancellor's, K.U. Dharwad.
4) O. S., (S&T branch) Academic section, K.U. Dharwad.

### స్వర్ణోత్సవ సమితి పక్షాన సన్మానింపబడుతున్న హిందీ పండితులు



పేరు : పూసల సుబ్బలక్ష్మి

వృత్తి : హిందీ పండితులు

కార్యక్షేత్రం : జంగారెడ్డి గూడెం

విద్యార్హతలు : ఇంటర్, రా భా , ప్రవీణ, ప్రచారక్

అభిరుచి హిందీ ప్రచారం, పరిచయ పరీక్ష నందు ప్రత్యేక కృషి.

చిరునామా పూసల సుబ్బలక్ష్మి, హిం॥ పం॥ జిల్లా పరిషత్ హైస్కూలు, జంగారెడ్డి గూడెం పోస్టు పోలవరం తా॥, పశ్చిమ గోదావరి జిల్లా.

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ– ఆంధ్ర

## స్వర్ణోత్సవాలు-1987

### స్వర్ణోత్సవ హిందీ పరిచయ పరీక్షా కార్యక్రమం

| | | | |
|---|---|---|---|
| 1. | (అ) | పరిచయ పరీక్షా శుల్కము స్వీకరించు చివరి తేదీ | 9-2-1987 |
| | (ఆ) | పరిచయ పరీక్ష జరుగు తేదీ | 22-2-1987 |
| 2. | (అ) | పరిచయ పరీక్షా శుల్కము స్వీకరించు చివరి తేదీ | 6-4-1987 |
| | (ఆ) | పరిచయ పరీక్ష జరుగు తేదీ | 19-4-1987 |
| | (అ) | పరిచయ పరీక్షా శుల్కము స్వీకరించు చివరి తేదీ | 6-6-1987 |
| | (ఆ) | పరిచయ పరీక్ష జరుగు తేదీ | 21-6-1987 |
| 4. | (అ) | పరిచయ పరీక్షా శుల్కము స్వీకరించు చివరి తేదీ | 10-8-1987 |
| | (ఆ) | పరిచయ పరీక్ష జరుగు తేదీ | 23-8-1987 |
| 5. | (అ) | పరిచయ పరీక్షా శుల్కము స్వీకరించు చివరి తేదీ | 10-9-1987 |
| | (ఆ) | పరిచయ పరీక్ష జరుగు తేదీ | 25-9-1987 |

ఎ. రామస్వామి
కార్యదర్శి



ది. 20-10-86న హిందీ స్టడీ సర్కిల్, విజయవాడ వారి ప్రమాణపత్ర వితరణోత్సవ సందర్భమున తీయబడిన ఛాయాచిత్రం. సభ ఉపాధ్యక్షులు బోయపాటి నాగేశ్వరరావుగారు ఉపన్యసించుచున్నారు. మండలి అధ్యక్షులు శ్రీ జొన్నాడ వీర్రాజుగారు ఆశీనులై ఉన్నారు.



ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ దక్షిణ భారత హిందీ ప్రచార సభలో హిందీ మాధ్యమంలో మొదటిసారి జరిగిన కంప్యూటర్ డేటాఎంట్రీ పరీక్షకు హాజరైన విద్యార్థులు, సంస్థాన్ ఉపాధ్యాయులు

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ– ఆంధ్ర
## స్వర్ణోత్సవాలు-1987

### సేకరించవలసిన నిధి వివరములు

సభ ప్రారంభిక పరీక్షార్థుల నుండి-ఒకొక్కరికి రూ. 3-00

సభ ఉన్నత పరీక్షార్థుల నుండి-ఒకొక్కరికి రూ. 5-00

ప్రచారకులు, పరీక్షార్థులు తాము పంపు పరీక్షా రుసుముతో పాటు ఈ విరాళములను కూడా ఆంధ్రసభకు పంపవలసినదిగా ప్రార్థించుచున్నాము.

ప్రారంభిక పరీక్షార్థు విరాళమును పరీక్షా రుసుము మరియు దరఖాస్తు ఫారములతో బాటు ఆంధ్రసభకు పంపగలరు.

ఉన్నత పరీక్షార్థుల విరాళమును మాత్రము ఆంధ్రసభకు పంపి పరీక్షా రుసుము మరియు దరఖాస్తు ఫారములు మద్రాసు కేంద్రసభకు పంప ప్రార్థితులు.

ఎ. రామస్వామి
కార్యదర్శి

Edited, Printed and Published by A. Ramaswamy on behalf of the D.B. Hindi Prachar Sabha-Andhra,-9 Khairatabad, Hyderabad-500 004.